# కాంతామతి.

ఆఱంకముల నాటకము.

గ్రంథకర్తలు:

రామనారాయణకవులు.

ప్రకాశకుడు:

కురుకూరి సుబ్బారావు,

భీమడోలు, కృష్ణాజిల్లా.

మొదటికూర్పు 1000 ప్రతులు.

కాకినాడ:

స్కేప్ అండ్ కో., లో

క. సుబ్బారాయుడు బ్రదర్సు వారివలన ముద్రితము.

1924.



[వెల రు 0-12-0.

# భక్తరామదాసు.

వెల రు 1—0—0.

[గ్రంథకర్త: పండిత కేతవరపు శివరామశాస్త్రిగారు.]

ఇందుభద్రాచల రామదాసుగారి చరిత్రమంతయు మనోహరముగ వర్ణింపబడియున్నది. గోపన్నగారి రామభక్తిపారవశ్యము చెరసాలయందాయన చూపిన నిశ్చలత్వసమానశక్తులు, శరీరమును బులకరింపచేయును. మాదన్నగారి బుద్ధివిశేషము, తానీషాగారి సర్వమత సమత్వము పరశ్రేయమును సహింపజాలని క్రిందియుద్యోగీయుల భంగపాటును జదివినకొలది పుస్తకము వదలబుద్ధి జనింపదు.

# శృంగారచాటుపద్యరత్నావళి.

వెల రు 0—4—0 మాత్రమే; చక్కని పద్యరత్నములు.

[గ్రంథకర్త అల్లంరాజు సత్యనారాయణమూర్తిగారు]

ఇందు చక్కని పద్యములు సమకూర్పబడినవి. పురుషవర్ణము, స్త్రీవర్ణనము, శృంగారపద్యరత్నములెన్నో గలవు చదువుట మొదలుపెట్టినచో సాంతమగువరకు విడువజాలరు ఇటువంటి పుస్తకము మీరుయెన్నడు చూచియెరుంగరు మాదిరికై యీక్రిందిపద్యమును చదివి యానందించి వెంటనే పుస్తకమునకు వ్రాయుడు.

సీ. బుకుమల్లు రైకలో కొంచుండి స్వర్ణకాం
తులజిమ్ము నీగుబ్బ దోయిజూచి
నీడగన్పదులాగు నెఱులునున్నగదువ్వి
కూర్చిన నీ చెంప కొప్పుజూచి
వెన్కపాటున నేగు వేళదత్తలలాడు
పచ్చనౌనీవెన్ను పట్టుజూచి
మాటనేర్చిన చంద మామ యంచననుప్పు
ముద్దులొల్కెడునీదు మోముజూచి.
గీ. చెంగలువపూవు వికసించు భంగి నెనగు
నీదు చిరునవ్వు పసజూచి నీరజాక్షి
పట్టు బిగ్గంబులేక నీ పై విరాళి
బలిచు నాచిత్తగతిఁజూడఁ గరుణరాదె.

# కాంతాహుతి

గ్రంథకర్తలు

రామనారాయణకవులు



ప్రకటనకర్త

కుంకూరి సుబ్బారావు

భీమునోలు, కృష్ణాజిల్లా

స్కేప్ అండ్ కో ముద్రాశాలలో

క. సుబ్బారాయుడు బ్రదర్సువారిచే

ముద్రింపఁబడియె.

**1924.**

 0—12—0

# ఇందువచ్చు పాత్రములు.

పురుషులు.

చిత్రసేనుఁడు—రాజు.

గోవిందశర్మ—గురుఁడు.

సాగరుఁడు—రాజు సేవకుఁడు.

ధనపాలుఁడు—వైశ్యుఁడు.

దుష్టబుద్ధి—నృపుఁడు.

ఇరువురు రాజకుమారులు.

దొంగ—

సుధర్ముఁడు—కళింగమంత్రి,

కాంతివర్మ—(కాంతామతి పురుష వేషము)

స్త్రీలు.

భువనమోహిని—చిత్రసేనుని యుంపుడుకత్తె

కాంతామతి—భార్య.

సుమతి—కళింగరాజపుత్రి.

నర్మద—చెలికత్తె.

సందర్భము ననుసరించి సేవకులు మొదలగువారు వత్తురు.



# కాంతామతి

—:ప్రథమాంకము:—

---

[రంగము.—చిత్రసేనుఁడు సభామందిరమున నొంటిగాఁ బ్రవేశించును]

చిత్ర—(తనలో)

తే॥ గీ॥ భువనమోహిని నిజముగా ◊ భువనమోహి
నియెయటంచుఁదలంతుహా ◊ న్నిరజమున
గాకయుండిన జగమునఁ ◊ గ్రాలునట్టి
వేశ్యలందునమిన్నయై ◊ వెలయఁగలదె.

ఆభువనమోహినివంటి సౌందర్యవతి యీజగమున లేదు.

తే॥గీ॥ ఏనరపతికో సతిగాఁగ ◊ నింపుమీఱఁ
జేయఁగానెంచియామాట ◊ సృష్టిజేయు
సమయమందుమఱచి వెల ◊ సతిగఁజేసె
ననుచుఁదలఁచెదఁ గాకున్న ◊ నట్టిదగునె.

వెలసతికుండు సులక్షణము లేమియు దానియొద్ద లేవు. దానికినాయందుండు గాఢానురాగము వర్ణనాతీతము. ఒక్కనిమిషము నేను గనఁబడకయుంటినేనిదిగులుజెందును. పూర్వజన్మమున నేనేదియో సుకృతముఁ జేసికొని యుండుటం జేసి, నాకీగణికయర్ధాంగియై యొప్పుచున్నది. సాధారణముగ వారసతులకు ననురాగముండదనియు, ధనమున్నంతవఱకే విటులను

జేరనిచ్చెదరనియు, గొందఱు చెప్పెదరు;— కాని,యట్టి దుర్గుణము లీ యంతి యొద్ద నుందున్నకైనఁ గానరావు.

సేవకుఁడు—(ప్రవేశించి) మహారాజా! గోవిందశర్మగారువచ్చి నారు.

చిత్రి—(తనలో) ఈసమయమున నితఁడేలవచ్చెను? భువనమో హినియింటికి నేను పోవలయు నని తలంచుచుంటినే. ఎందులకు వచ్చె నో కనుఁగొని శీఘ్రముగాఁ బంపి వేసెదఁగాక—(సేవకునిఁజూచి) లోనికి రానిమ్ము.

సేవ—(నిష్క్రమించి—గోవిందశర్మతోఁ బ్రవేశించును)

చిత్రి—(గోవిందశర్మను జూచి) భూసురోత్తమా! వందనము లందుకొని యీపీఠమున నాసీనులగుఁడు.

గోవిం—(ఆసీనుఁడై) నృపాలా! నీతోఁగొన్ని విషయములఁ గూర్చి సంభాషింపఁదలఁచి వచ్చితిని. నాయందున్న భక్తిచేఁ దగిన యవకాశము నాకిచ్చెదవని నమ్ముచున్నాను.

చిత్రి—అంతతొందర పనియా యది? మఱియొకసమయమున మాటాడరాదా?

గోవిం—ఇప్పుడు నీకేమయినతొందరపని యున్నదా? నీచిత్త మేదయిన రాజకార్యాలోచనము దెస వర్తించుచున్నదా?

చిత్రి—రాజకార్యాలోచనమేమియు లేదు.

గోవిం—అట్లయిన నింకఁదొందరపని యేమున్నది?

చిత్రి—(మాటాడక యుండును)

గోవిం—భువనమోహినిమందిరమున కేగవలయునా యేమి?

చిత్రి—గురువులకు మీకుఁదెలియని విషయమేమున్నది?

తే॥గీ॥ కూరుచున్న, నిలచియున్నను కూర్కుచెంది
యున్న; మేల్కాంచియున్నను నువిదరూపు

కన్నులకుఁగట్టినట్టులఁ గానఁబడును
కారణంబేమొదీనికి తెల్పుసురేంద్ర.

గోవిం.—చెడిపోవుటకె కారణము.

చిత్ర—ఆర్యా! అట్టుపలికెదరేమి?

గోవిం—వారాంగనల .. నెవారెవరు బాగుపడిరి.

చిత్ర—ఎవరో స్వల్పముగా ధనమున్నవా రట్లు చెడిపోయి యుందురేమో. అయినను నట్లు సంభవించుట యువతలవేశ్యయొక్క యనురాగమును బట్టి యుండును.

గోవిం—వేశ్యజాతియందు నిజమైనయనురాగ ముండునని నీవు తలంచెదవా? కాకిజాతియందు తెలుపును, వేశ్యకు విటునియందు నిజమైనవలపును, లంచగొండికి న్యాయమందు దలఁపును, నుండదనుమాట నీవెఱుఁగకుంటివా?

చిత్ర—మీరు చెప్పినది నిజమే. కాని భువనమోహినిమాత్ర మట్టిదికాదని నేను నొక్కి వక్కాణింపఁగలను.

అనుబంధము (1)

దానిని సామాన్యవేశ్యగా భావింపరాదు. పూర్వజన్మమున నేమాత్రమో పాపముఁ జేసికొని యుండుటచేత విరించి దానిని వారాంగనగా సృష్టించినాఁడు. గురువర్యా! ఉత్తమగుణములుగలిగి రాజిల్లు కాంత వేశ్యయైననేమి? మఱియెవ్వరైననేమి?

తే. గీ. వేశ్యయైననుసాధ్వియై వెలయుచుండి
నన్ను నిరతంబు సేవించు నాతిమిన్న
భువనమోహినిగుణముల బొగడఁగుఱ్ఱి
యందు బదములులేకుండె నయ్య దేవ.

గోవిం—రాజా! నీపాండిత్యమంతయు భువనమోహినిని వర్ణించుటకే వినియోగపఱచుచుంటి

తే॥ గీ॥ కపటబుద్ధికిఁ బుట్టిల్లు ♦ విపులమాయ
తంత్రములకునిలయమట్టి ♦ ధనవనితగృ
హమున జననంబునందిన ♦ యతివసాధ్వి
యంచు వచియింప నోరెట్లు ♦ లాడెనీకు.

మ॥ ధనమేముఖ్యముగాఁగఁజూచుచునుమో ♦ హంబార నెవ్వానినై
ననుఁ, నంధుండయినన్ గురూపియయినన్ ♦ గామించియవ్వానితో
ననిశంబున్ గమియించు వేశ్యకులమం ♦ దాయింతిజన్మింపదే
వినుమీరీతినిఁబల్కినన్ నగరె భూ ♦ ధీశా! జనుల్ నిన్నునున్.

ఎక్కడనైన గణికలలో సాధ్వులుందురా?

చిత్రి—భువనమోహిని సాధ్వియని నేను చెప్పఁగలను.

అనుబంధము - 2.

గోవిం—ఇట్లు వచించినవారినెందరినో చూచినాను లోభి యందు ధర్మగుణమును, వేశ్యయందు సాధ్వీత్వము నుండునా? వేశ్యలను మఱగి యెందఱు తమసర్వస్వము గోలుపోయిరి.

చ॥ గణికలపొందుస్వర్గమని ♦ కన్నులుమిన్నులుగానకుండ, న
వ్వనితలఁజేరి, భాగ్యము న ♦ వారితలీలనుదోచిపుచ్చి, ని
ర్ధనులయిలోకులెల్లరును ♦ దిద్దయుఁ వ్వాగఁ బొట్టకూటికై
ఘనతచెడంగ, భిక్షుకులు ♦ గా ధరమాఱిన వారిఁజూడమే.

ఇంక నీవా వారాంగననుగూర్చి విశేషముగా వర్ణించి చెప్పవలదు. నావచనము లాలించి యెట్టిదైనను భువనమోహినిని బరిత్యజించి, వివాహమాడి సుఖింపుము నీవు రాజువైయుండి యిట్లు దుష్కార్యపరతంత్రుఁడవై యుండుట శత్రురాజులకు హాస్యాస్పదముగనుండును. ప్రజలకుఁగూడ నీయందు గౌరవము క్రమక్రమముగాఁ దగ్గిపోవును.

తే॥ గీ॥ రాజువగుటచేతను బర ♦ ప్రజలునీకు
నెదుటఁబల్కఁ జాలరుకాని ♦ యెవ్వరేమి

చెప్పుకొనుచుండిరో నీదు | చెవులఁబడెన
గౌరవంబుండునే నీకు | క్ష్మాతలేంద్ర.

తే॥ గీ॥ యశముగాంచినవంశంబు | నందుఁబుట్టి
పుడమినాథుఁడవౌచును | బాలుపుగాంచి
యక్కటా! వేశ్యకీరీతి | జిక్కి రాజ్య
పాలనంబును మఱతువే | పార్థివేంద్ర.

జరగినదానింగూర్చి యిప్పుడు విచారించిన లాభములేదు. ఆవేశ్యకుఁ స్వస్తివాక్యముఁ జెప్పి వివాహమాడి సుఖింపుము.

చిత్ర—గురువర్యా! భువనమోహినినివిడిచి, వివాహము జేసికొనుమందురా? వివాహమాడెడుసతి యింతకన్న నెక్కుడదియగునా? ఆగణికను విడుచుటకు నాచిత్త మెట్లుసమ్మతించును?

చ॥ అనిశము నన్ను దైవముఁగ | నాత్మదలంచుచు సేవఁజేయునా
గుణములప్రోవు వారకుల | కోమలినిన్ విడనాడఁబాడియే
మన మెటులొప్పు దీనికిని | క్ష్మాసురవంశసముద్రచంద్ర! యా
వనితను గూర్చి యీకరణి | బల్కకుమా యిఁకనీకు మ్రొక్కెదన్.

గోవిం—చిత్రసేనా! నీవజ్ఞానాబ్ధిలోఁ బడి యీలీలఁ బలుకుచుంటివి. "మొట్టికాయరుచి బొప్పికట్టునఱకను దెలియదుకదా"

తే॥ గీ॥ వారిపేరికిఁ గొంగును | పఱచియుదర
పోషణముఁజేసికొను వెల | పొలఁతినిట్లు
పెద్దగాఁజేసివర్ణింతు | వే నృపాల
దీనిఁగని నవ్వుదురుగదె | ధీరులెల్ల.

ఇఁక నీవావిషయమును విడిచిపెట్టి వివాహప్రయత్నమునను౦డుము.

చిత్ర—స్వామి! ఆవిషయముమాత్రము నాకు చెప్పవలదు.

గోవిం——

చ॥ అతివను నెక్క తెన్ బరిణ । యంబును నాడి. జనుల్ నుతింపఁ నం
తతిఁగని రాజులందువిత । తంబగు సద్యశమంది యొప్పగా
మతిఁదలపోయకీకరణి । మాయలమారివిలాసినీమణిన్
గుతుకముతోడఁ జేర్చితివి । గోల్పడఁ కుందువె సర్వమున్ నృపా.

రాజా——ఇఁక నీమాటలతోఁ బ్రయోజన మేమియును లేదు. నామాటవిని సత్వరంబుగ వివాహ ప్రయత్న మొనరింపుము.

చిత్రి——గురువర్య! ఏలయీలీలఁ బలుమారులీసంగతి మాట్లాడెదరు. నేను వివాహమాడనని భువనమోహినితోఁ బ్రమాణముచేసి యుంటిని. ఇప్పుడు నేను దానికి వ్యతిరేకముగా నెట్లువర్తించెదను?

గోవిం——ఓహో! నీవు సత్యహరిశ్చంద్రునివలె నున్నాఁడవే. వేశ్యతోడ జేసిన బాస నిలుపుకొని పరువుబోగొట్టుకొనుటకుఁ బ్రయత్నించుచుంటివా? ఆహా! నీసత్యసంధతకు మెచ్చవచ్చును. ఈమాటల నెవ్వరైన విన్న నవ్వెదరని యైన నాలోచించవేల? వేశ్యయెడలఁ జేసినవాగ్దత్తమునకు భంగ మొదవినచో ధర్మహాని కలుగదులే! నీ వావిషయమునుగూర్చి భయం బొందవలదు. సద్వంశమున——అందులోను క్షత్రియవంశంబునం జనించి;-ధరాపాలుండవై యొప్పుచున్న నీవు-అక్కటా! సామాన్యమానవునివలె కేవలజారునివలె మానాభిమానములఁ దలంపనిమూఢునివలె- అవివేకివలె;-ఈరీతినుండఁదగునే? నీ వొంతరాజాధిరాజువైననేమి, వేశ్యాలోలుఁడవై యుండుటఁ జెల్లునే?

చిత్రి——

తే॥ గీ॥ నాదుమేనఁ బ్రాణంబులు । న్నంతవఱకుఁ
బాయ నిన్నటంచును నేను । బాసఁజేసి
యిప్పుడీరీతిఁబాయుట । యేటిగుణము
సమ్మతించునెచిత్తంబు । సచ్చరిత్ర.

ప్రథమాంకము.

ఇదియుం గాక యారోగమువలన నెట్టిలోపమును లేదు.

సీ॥ చిత్తమందెప్పుడా । శ్రీయమే కోరుచు,
భక్తితోడనుగొల్చు । పద్మగంధి
నిమిషమైననుగాని । నేను రాకుండిన,
గలువరించుచునుండు । కంబుకంఠి
యర్ధాంగికన్నను । ననురాగవతియౌచు,
బతిభక్తి నెఱపెడు । వారిజాక్షి
నామీదమోహమే । నవ్యభూషణముంచు,
దలఁచివర్తించెడు । తరుణిమిన్న

తే॥ గీ॥ పణ్యాంగనాకులమందుఁ బుట్టియు । బరమసాధ్వి
యై ననుం గొల్చుచున్నట్టి । యలఘుచరిత
యట్టిభువనమోహినివీడ । నగునె నాకుఁ
గలదె లోపంబు, నక్కాంత । వలన దేవ.

దేవా! ఆభువనమోహిని నారెండవప్రాణము. దానిమోహపాశముల నేను బద్ధుండనై యుండి విడిపించుకొనుటకుశక్తుఁడగాక యున్నాను. అది మహామోహసాగరము. అందుబడితిని. తేలుదునో, మునుఁగుదునో దైవమే యెఱుంగును. దానిస్నేహము విడుచుటకు మీ రెంత చెప్పినను నా చిత్త మంగీకరింపదు. వారకాంతాలోలత్వమువలన యశోహాని యని మీరు చెప్పుమాటలకు నేను సమ్మతింపను.

గోవిం— వేశ్యావ్యామోహమువలన ననేకులు తమసర్వస్వమును గోలుపోయి తుదకు భిక్షుకులైరని నీవు చదివినగ్రంథములలో నెచ్చటనుఁ జూడలేదా?

చిర్రి— చూచితిని! మహానుభావులమని చెప్పుకొనినవారు చేసిన చర్యలన్నియుఁ జూచితిని.

సీ॥ మృతభర్తృలెల్లి ♦ మొలతలమఱదండ్రి,
నాశింపగాలేదె ♦ వ్యాసతపసి
యతిస్త్రీపదము ♦ బాచరించియుమేన,
కంగూడగాలేదె ♦ గాధిసుతుడు,
యువిదలనెఱుగకే ♦ యుండియువెంటబ,
డడె వారిం విభాం ♦ డకసుతుండు,
శిష్టుడైయుండియు ♦ జింతామణింగూడి,
వాసినింగాంచెలీ ♦ లాశుకుండు,

తే॥ గీ॥ వారికంటెనుఘనుడనా ♦ వారనారి
వలనగౌరవంబుకేల ♦ భంగ మొదవు
నెన్ని చెప్పినవినుడయ్య ♦ వన్నెలాడి
భువనమోహినినెడబాయ ♦ బొందుపోదు.

గోవిం——వారికిని నీకును పోలికయా! చాలుజాలు. తుదకు గురుధిక్కారమునకుగూడ సాహసించుచుంటివి. వేశ్యావ్యామోహపాశమునందు జిక్కి వివాహమొల్లనని పలుకుచున్న నీ వెఱ్ఱితనమునకు నే నేమనిచింతింతును. సుక్షత్రియకులంబున; పేరుప్రతిష్ఠలు గలిగిన నీ తండ్రి గర్భమున, క్షీరసముద్రమున గరళముజనించిన విధమున నీవు జన్మించితివి.

సీ॥ భువనమోహినికాంత ♦ మూలంబుననుగాదె,
స్నేహితులంబెల్ల ♦ మఱచినావు
భువనమోహినికాంత ♦ మూలంబుననుగాదె,
శిష్టులేరునునిన్ను ♦ జేరకుండ్రి
భువనమోహినికాంత ♦ మూలంబుననుగాదె.
జనులకుభక్తియు ♦ సన్నగించె
భువనమోహినికాంత ♦ మూలంబుననుగాదె,
ధనమునానాటికి ♦ దఱగుచుండె.

తే॥ గీ॥ ఇట్టివన్నియుఁ గననెంచ । వేల? చేయి
కాలినపిదప నాకుల । కై వెదకిన
లాభమేమి? యీమాటఁ ద । లంచి యుప్పు
డైన, సతినొక్కతె వివాహ । మాడుమయ్య.

ఇంక నీవునామాటలకుఁ బ్రత్యుత్తరమీయక సమ్మతింపుము. ఈ కార్యభారము నేను వహించెదను. ఇదియుఁగాక, జయంతపురాధీశ్వరుఁడు తనపుత్రికను నీకిచ్చుటకింతకుము న్నన్నియో వార్తలఁబంపియున్నాఁడు. అక్కన్యక సహజసౌందర్యవతి. సద్గుణములప్రోవు. కావున నీవామెను వివాహమాడి కులము నిలుపుము. ఎన్నితరములనుండియో కీర్తిచంద్రికలు దిక్కులగాయించుచున్న మీసద్వంశమును నీతోడనే యంతము చేయవలదు. తుదకునీబ్రదుకు నగుబాట్లపాలగును.

సీ॥ కాముతూపులబోలు । కమలాక్షి చూపుల,
వీక్షించిభ్రమియించి । వెఱ్ఱులగుచు
ధనముం డొగాయంచుఁ । దలచిమోహజలధి
యందునఁగూలిధ । నాంగనాగృ
హంబులజేరి, ద్ర । వ్యంబుకుదువబెట్టి,
కడకువారలచేత । వెడలఁగొట్టఁ
బడి; యభిమానముఁ । విడచిరోగములచే,
నావరింపంబడి । యఖిలజనులు.

తే॥ గీ॥ కనుసహ్యంబుగాజూడ । గుడువఁగూడుఁ
గట్టబట్టయులేక, భి । క్షంబునెత్తి
కొనుచు; వేశ్యపేరునుజెప్ప । కొనుచుజీవ
యాత్రగడుపువారలను నీ । వరయలేదె.

సముద్రముయొక్కలోతైనను గనుఁగొనవచ్చును గాని, వేశ్యామోహసాగరముయొక్క లోతు నరయఁజాలము.

తే॥ గీ॥ ఉంచుకొన్నట్టివనితయుఁ జెంచుకొన్న
కొడుకు నెత్తిపై శరగోప మిడుదురనుచు
పెద్దలాడెడువాక్యంబు వినఁగలేదె
వినియు లక్ష్యంబుసేయవా? వెఱ్ఱివగుచు.

చిత్రి — దేవా! విరాగిట్లు పలుకుచు నాకుఁ గష్ట మేలగలిగింతురు?

మ॥ ధనమున్ బోయిన మానమున్ జెడిననిం దల్ నచ్చినన్ బంధువుల్
గనరాకున్నను; మేలుగోరుహితవర్గంబెల్ల దూషించినన్
ఘనశత్రుప్రకరంబు నవ్వినను సంగ్రామంబులో గెల్చినన్
ధన కాంతామణి పొందుమీఁదను సుఁడీ తథ్యంబుముమ్మాటికిన్.

గోవిం — ఏమిరా! కురుండనగు నే జెప్పుచున్న పలుకులు వినక నారకామిని యలోకబడి గురునే నిరాకరించుచుంటివే. ఇట్టి నీతలను పుట్టినబుద్ధియా! లేక యెవరైన బోధించిరా? బాల్యమాదిగ నీయభివృద్ధిని గోరినవాఁడనగుటచే నింతదూరము చెప్పితిని. నేకున్న నా కేమియవసరము! ప్రస్తుత మీసంపదయున్నదికదా యని గర్వించుచుంటివి. వేశ్యవలలో నిట్లే మఱికొన్ని దినములుతిక్కియుంటివేని యీసంపదయిట్లేయుండదు. ఈసంపదయున్నంత కాలమే నిన్ని వేశ్య యనురాగముతోఁ జూచుటగాని, బంధుమిత్రులు నచ్చుటగాని సంభవించును.

అనుబంధము- 3.

కావున నీ వాక్యములు చాలించి జయంతపురాధీశ్వరుని పుత్రికయగు కాంతామతిని బరిణయంగాఁడుము. నే నారాజన్యుని సన్నిధికేగి స్థిరపఱచుకొని వచ్చెదను. ఇఁక మారుపలుకకుము.

చిత్రి — (తనలో) నేను వివాహమాడనని భువనమోహినితోఁ బ్రమాణము చేసియుంటిని. ఇప్పుడు నే నిందులకు సమ్మతించితినేని యామెవలఁది కేమియాగ్రహము వచ్చునో! కానిమ్ము! ఈగురునితో నిట్లు చెప్పెదఁగాక- (ప్రకాశముగా) భూసురోత్తమా! వివాహమునకు నేను రాఁజాలను. ఇందులకు మన్నింపుఁడు.

గోవి—పెండ్లికొడుకులేని పెండ్లియా!

చిత్రి—మహారాజులలో పెండ్లికొడుకవసరములేకుండ, ఖడ్గమును బంపుట యాచారమైయున్నది.

గోవిం—(తనలో) ఈతనినెట్లో సమ్మతింపజేసి పరిణయము జేసెదఁగాక! ప్రకాశము, కానిమ్ము. నీయిష్టము వచ్చినట్లే చేయవచ్చును. నే నీదినమునఁనే మామంత్రిపుంగవునితోఁ గూడ బయలుదేరి, జయంతపురమునకరిగి సంబాధము స్థిరపఱచుకొని లగ్నము నేర్పఱచుకొని వచ్చెద. నీవును తగినప్రయత్నములనుందుము.

చిత్రి—చిత్తము.

(తెఱవాలును.)

రంగము:—భువనమోహిని మందిరము:—

ప్రవేశము. భువనమోహిని.

భువ—(తనలో) భళా! ఈచిత్రసేనుఁడు నామాయలోఁబడి రాజ్యకార్యములనెల్ల మఱచి నేనే మోక్షమని తలఁచుచున్నాఁడు. నా తెలివిచేత, కపటానురాగముచేత, కల్లబొల్లిమాటలచేత, యీతని సంపదలు నెమ్మదిగా హరించుచున్నాను. ఆహా! ప్రపంచమున మోహమునుమించినది మఱియొక్కటిలేదు. " ఇనుపకచ్చడాల్ గట్టిన ముని ముచ్చులెల్ల తామరసనేత్రలిండ్ల బందాలుగారె" యనిపూర్వకవివిరచిత పద్యము సత్యము. ఎట్టివారినైనను, మోహంపుటురులఁబన్ని కిరాతుఁడు మృగంబులను బంధించు నట్లుగా బాధించుటకు మావేశ్యలకే తగిపోయినది.

(4)అనుబంధము—

ఎంతటివాఁడైననేమి! ఎంతపరమనైష్ఠికుండైననేమి! వారనారీ చారుచూపులెఱుఁగఁజాలనేని తద్గృహంబును బ్రవేశింపక మానునా ప్రవేశం

చి మాదాంగవలపులోఁ బడి తనసర్వస్వము మాకీయకుండునా? కొందఱు సంఘసంస్కారులు మమ్ము దూషింపఁ బ్రారంభించినారు. "కులవృత్తికి సాటిలేదు గువ్వలచెన్నా" యనియున్నమాట వారు చూడలేదు కాఁబోలు !

తే॥ గీ॥ కాముకులకు వలసిన సౌ ఖ్యంబులిచ్చి
బ్రదుకుడీయంచు మొగమున వ్రాసి ధాత
మమ్ము సృష్టించిమించెను మహితలమున
సానులందు నింతైనదో సంబుకలదె.

(ఇంచుకయూరకుండి) ఈచిత్రసేనుఁడు నాయందనురాగముచే మదీయాజ్ఞాతిక్రమణము చేయలేక వివాహము గూడ నొల్లకయున్నవాఁడు. ఇఁక కొలఁదిదినములలోనే యీతఁడు సన్యాసి కాఁగలఁడు. ఇటువంటివారు నాచేతిమీఁద నింతకుమున్నెందఱుయిరో!

సాగరుఁడు—(ప్రవేశించితనలో) ఆహా! ఈచిత్రసేనునివర్తనము చూచిననవ్వువచ్చుచున్నది. నవ్వుతో విచారము గూడనున్నది. ఇదె స్వర్గమని యెప్పుడు భువనమోహినితోడనే కాలక్షేపము చేయుచుఁ దనకాలమంతయు వ్యర్థము సేయుచున్నాఁడు. బొక్కసముననున్న ధన మైపోయినదని మంత్రులాలోచించుచున్నారు. ఈతఁడీభువనమోహినిచేతిలో కీలుబొమ్మయైనాఁడు. ఈతనిపాలిటికిఁ గాలయముని లె యీ ముండ యెక్కడదాపరించినదోకదా! రాజగుటచేత నెవ్వరును సమీపించిచెప్పుటకు సాహసింపరు. (ఇంచుకయూరకుండి) గురుఁడగుగోవిందశర్మ యెట్లోపట్టుపట్టి రాజును వివాహము జేసికొనునట్లు సమ్మతింపఁజేసినాఁడు. అదియుఁ గొంత మేలే; కాని యీకులట యందుల కేమియంతరాయము గలిగించునో!

భువ—(సాగరునిఁజూచి) సాగరుఁడా యేమి! సాగరా! నీవు వచ్చి యెంతసేపయినది? మాటలాడక ఱాయివలె నిలఁబడియుందువేమి?

సాగ—(కూర్చుండును.)

భువ—అదియేమి ? కూర్చుంటివి ?

సాగ—నిలఁబడియుంటి వేనుని పలికితివికదా !

భువ—ఓహో ! నీకేమాట చెప్పినను తెలియదే. వట్టిమూర్ఖుఁడవు.

సాగ—మూర్ఖుఁడనుగనుకనే యిచ్చట నీగృహమున కొలువునకున్నాను. ఇది నాప్రారబ్ధముకదా! మహారాజులగృహములందు సేవజేయు నేను నీగృహముననుండవలసివచ్చినది. ఇందుకు నాకు నవ్వు వచ్చుచున్నది.

భువ—ఎందుచేత !

సాగ—ఏమున్నది ! బ్రహ్మకృత్యములన్నియువిచిత్రములు. ఏ మహారాజకుమారులో, మాకు రాణియై పరిపాలించుటకుమారుగా!—ఎన్నడును తలపనితలంపుగా—సామాన్యకులమున— అందు వేశ్యకులమునజన్మించిన—నీవు మాకు రాణివైతివి. భగవద్విలాసమున కద్భుతమందుచున్నాను.

భువ—నేను రాణినగుట నీకిష్టములేదా.

సాగ—ఇష్టమైనను గాకపోయినను, నాపొట్ట పోసికొనుటకీపని చేయవలయునుగదా ! (ఇంచుకయూరకుండి) అయినను, నాకీ సేవకావృత్తియు, నీకీరాణీపదంబును భగవంతుఁడు త్వరలోనే విముక్తిఁ జేయునని తోఁచుచున్నది.

భువ—నీమాటలయందర్థము దోఁచుటలేదు. నీవు నాయెదుట నిర్భయముగాఁ బలుకసాహసించుచుంటివి.

సాగ—ఏమున్నది ? మాకు నిజమైనరాణివచ్చును. అదియే కారణము.

భువ—(తనలో) ఏమిది! చిత్రసేనుఁడు వివాహమాడునా యే మి? నిన్నటివఱకును లేనిబుద్ధి యీనాఁడేలకలిగెను. (ప్రకాశముగా) సాగరా! మీరాజుగారు వేఱొకవేశ్యనుఁ దెచ్చుకొందురాయేమి?

సాగ—ఇంకను వేశ్య లేనా! రాజుగారి నుద్ధరించుటకు నీవుంటి వి చాలదా! ఉంచుకొన్నముండ, పెంచుకొన్నకొడుకు — నమ్మిన ట్లులా?

భువ—నోటికి మాటలు తిన్నగ రానిమ్ము.

సాగ—నామాటలలో వంకర యెప్పుడును నుండదు. గురుప్రల వారగు గోవిందశర్మగారు రాజునకు బోధచేసి వివాహము జేసికొనునట్లు చేసి సంబంధము స్థిరపఱచి లగ్నము విచారించుటకు వెళ్ళినారు. నినో టిలో మన్నుగడ్డ—మానోట్లో బెల్లపుగడ్డ—

భువ—ఏమీ! మీరాజు వివాహమాడునా? ఆసంగతి సవి స్తరముగఁ జెప్పుము—

సాగ—అనవసరమైనసంగతులునా కేల! నాకిది యేపనియా! నేను పోయి వీధిగుమ్మముకడ నుండవలయును. రాజుగారిప్పు డిచ్చుటకు వ త్తురు. (నిష్క్రమించును)

భువ—(తనలో) ఆహా! చిత్రసేనుఁడు వివాహము జేసికొనుట కు నిశ్చయించుకొనినాఁడు కాఁబోలు. ఆతని గురుఁడగు గోవిందశర్మ— యాతనిచిత్తము ద్రిప్పివేయుటకుఁ బెక్కుదినములనుండి ప్రయత్నించు చున్నట్లు వినియున్నాను. రాజీసంగతి నాకొక్కింతయుఁ జెప్పక, నా యనుమతినిబొందక యంగీకరించునా? ఏమో! గురునిబలవంతముచేత నంగీకరించియే యుండును. అట్లాతఁడు సమ్మతించియేయున్నచో నే నేమి సేయుదును! కానిమ్ము; ఇందులకు! గర్తవ్యము రాజువలన వినిపి దప నాలోచించెదను ఆతఁడు వచ్చునప్పటికి నేను మాసినచీర గట్టి

కొని, భూషణములన్నియు దీసి వేసి, నేలపైఁబడియుండి క్రోధము—అను రాగము- నటించుచు నాటలాడెదఁగాక!

(భూషణములదీసి వేసి—వెల్లోకవస్త్రమును ధరించి—నేలపైఁ బండియుండును.)

(చిత్రసేనుఁడు—ప్రవేశించును.)

చిత్ర—(తనలో) నేను వచ్చుచున్న జాడ నెఱిఁగి నిరతము నాకెదురుగా వచ్చు భువనమోహిని నేఁడేల రాకయున్నది. (ఇటునటుజూచి) ఏమిది! భూషణహీనమై మాసినచీరెగట్టి కటిక నేలపైఁ బడియున్నది. ఇందులకుఁ గారణమేమైయుండునో! (ఎదుట జూచి) సాగరా! సాగరా!

సాగరుఁడు—(ప్రవేశించి) మహారాజా! ఏమిసెలవు?

చిత్ర—దేవి యిట్లున్నదేమి?

సాగ—దేవికి దయ్యము సోకినదేమో!

చిత్ర—ఛీ!

సాగ—కాదు మహారాజా! ఇంతకును స్వప్నమె సంతోషము తోడనే యున్నది ఇంతలో నిట్లగుటకుఁ గారణము తెలియదు. పిలచిచూచినఁ దెలియఁగలదు.

చిత్ర—(భువనమోహినిని సమీపించి) ప్రేయసీ! భువనమోహినీ! లెమ్ము లెమ్ము.

సాగ—రాజా! పలుకుట లేదు. ఒకవేళ నేను తలఁచినట్లు గాలియే సోకినట్లున్నది. లేక యేపెద్దలైన వచ్చిరేమో! పెద్దలైతే తలఁచుకొని దండము పెట్టుకొంటేపోతారు. దయ్యమైతే వెన్నుపూసను యినుపకాడ కాల్చి రక్షవేస్తే యావహించిన యాదయ్యము మన రాజ్యములో నుండకుండా పాఱిపోవును.

చిత్ర—ఛీ! నీవిచ్చటనుండి పొమ్ము నీపనిచూచుకొనుము.

సాగ—మంచిదే—(నిష్క్రమించును)

చిత్ర—(తనలో) ఈకాంతయెందులకో యలుకవహించియున్నవిధము తోఁచుచున్నది. నెమ్మదిగాపిలచి యీమెయలుకఁ దీర్చెదఁగాక! (భువనమోహిని శరీరముపైఁ జేయివైచి) నారీమణీ!

మ. అలుకా! పిల్చినపల్కవేలను? పరా। కాయింత! భామా! రమా
లలనాసూనుఁడు తీవ్రమైనశరజా। లంబందునన్నుంచె నీ
యలుకన్ మాని, త్వదీయనామధురవా। క్యశ్రేణితో నన్నునుర్
బలుమోదంబున గారవింపుమిఁక; సై। పంజాల నీకోపమున్

లెమ్ము—లెమ్ము—(లేపదీయును.)

భువ—ఉష్! ఎవరువారు?

చిత్ర—ఎవరువారని యడుగుచుంటివా?

5 అనుబంధము.

తే. గీ. ఎవరువారని యడుగంగ। నేల తరుణి
భవ్యభవదీయమానస। పద్మమును హ
రించినట్టివాఁడనుగాదె। చంచలాక్షి
యలుకమానుచుఁ జూపుమీ। యమితకరుణ.

సఖీమణీ! నేను పెఱవాఁడనా! చిత్రసేనుఁడనుకాదా! అకారణముగ నిట్లాగ్రహము వహించి నాకు చిత్తసంతాప మేలకలుగఁజేసెదవు.

తే. గీ. రమణి, నీయధరమధుర। రసముతనివి
దీరఁగ్రోలుచునుంట గా। దే! మనంబు
నందు నితరచింతలఁబాసి। యతిముదమున
నీకు దాసుండనైయుంటి। నిక్కముగను.

నీ విదియైనఁ దలంపవలదా! ఎన్నఁడయిన నీకు వ్యతిరేకముగాఁ బ్రవర్తించియుంటినా లెమ్ము. లెమ్ము. నీయభీష్టమెట్టిదో తెలుపుము.

భువ—ఓహో! చిత్రసేనా! నీసంగతి నాకు నేఁటికిఁ బూర్తిగాఁ దెలిసినది.

## 6 అనుబంధము.

అహ్హరా ! సీ విట్టివాఁడ వని యెఱుఁగ కుంటిని నెఱుంగనైతిని.
ఆహా ! పురుషులకున్న లక్షణ మిది కాఁబోలు !

చ. అక్కరగల్గునేని దగు నీయంతటివారలు లేరటంచుఁబల్
మక్కువఁజూపుచుం మిగుల నమ్మనలందఁగఁజేసి కాంతలం
బ్రక్కకుఁజేర్చుకొందురు మగ ల్నారలు; నక్కఱదీరనేని యా
మక్కువయంతయుం మఱచి మాయలుబన్నుదు రేమిచోద్యమో

చిత్రి—భువనమోహినీ ! నీవు నిశ్చయముగా నా పాలిటి భువనమోహినివని తలంచుచుంటిని. అట్టిచో నావలన నపరాధ మేమియున్నది! ఏదియైన దోషమున్నచోఁ జెప్పుము సవరించుకొందును.

భువ—నీవలన దోషము లేదు. నీవు సవరించుకొననక్కఱ లేదు. నాదారిని నేను జూచుకొనెదను. ఇఁక నీకుఁ గ్రొత్తభార్య వచ్చును కదా ?

చిత్రి—(తనలో) ఓహో ! ఈ సంగతి యిక్కడికిఁ దెలిసినదే. (ప్రకాశముగా) మనోహరి ! ఇదియా నీకుఁ గలిగినయాగ్రహము! నీకింతలోనే యీవార్త నెవ్వరుచెప్పిరి.

భువ—ఏమి ! నీవువివాహమాడఁదలంచినమాటయసత్యమా!

చిత్రి—అసత్యమని నేనుచెప్పితినా? కాని యొక్కవిషయము మాత్రమున్నది. గురుఁడగుగోవిందశర్మ ప్రేరేపణమని తలంపుము. ఆతనిమాటఁ ద్రోసిపుచ్చుటకుఁ బ్రయత్నించితిని గాని ప్రయోజనము లేకపోయినది. గురులతో గ్రుద్దులాట తగదని తలంచి యెట్లో సమ్మతించితిని.

భువ—ఇంతకును బెండ్లికూఁతు రెవరు?

చిత్రి—జయంతపురాధీశుని పుత్రికయగు కాంతామతి.

భువ—(తనలో) ఆకాంతామతి సౌందర్యమున నసహాయని విని యుంటిని. ఆమె నీతఁడు జూచెనేని నావంక నైనఁ జూడఁడు. కానిమ్ము వీరిరువురును గలియకుండ నేదైనకర్తవ్య మూహింపవలెను. (ప్రకాశముగా) దేవా! వివాహ మెప్పుడు-మీ రెప్పు డేగెదరు?

చిత్రి—రమణీ! నిన్ను విడనాడి యొక్కనిమిష మైన నుండఁగలనా? వివాహము నీకంటె నెక్కువా?

భువ—వివాహమునకు నీ వరుగకుండగనే యగునా యేమి!

చిత్రి—ఖడ్గము బంపితిని.

భువ—(తనలో) నాయుద్యమమునకిది బాగుగనున్నది. పెండ్లికూఁతు రిక్కడకు వచ్చినపిదప నీతఁ డామెను జూడకుండఁ జేసెదను. ఇందుల కుపాయ మేదేని పన్నవలెను. (ఆలోచించి) ఉపాయమునకేమి? వేశ్యనైన నాకిట్టియుపాయమే దొరకక యుండునా?

సీ. వివిధమాయలఁబన్ని । విటులగృహంబులఁ
జేరగానెట్టులో । చేయుచుంట
చేరగాఁదీసి యే । తీరునో వారిపై
వలపుగల్గినయట్లు । బలుకుచుంట
పలికి; మోహంపుటురుల । జిక్కగాఁజేసి
తెచ్చిన ద్రవ్యంబు । దోచుకొంట
దోచుకొనుచు వారి । తోయజాక్షులతోడ
వైరంబుగల్పించి । వరలుచుంట

తే. గీ. తుదకు విటులను తిరిపెము । త్తుకొనునట్లు
జేసి, మదిలోన మోదంబు । జెందుచుంట
వేశ్యకులమందు జన్మించి । వెలయుచున్న
కాంతలకునుండునట్టి ల । క్షణము లెసఁద.

(ప్రకాశముగా) నాథా ! నీవు వివాహము జేసికొందువనుచింత నా కావంతయు లేదు. కాని, నాకేల యీసంగతి తెలుపలేదాయని మాత్రము కోపము.

చిత్ర—రమణీమణీ! నేనిక్కడకు రాకమునుపే నీకుఁ దెలిసినది. నేను నీకుఁ జెప్పకయుందునా? ఎంత వెఱ్ఱిదానవు.

భువ—మనోహరా ! నీవు వివాహ మాడుచున్నందులకు సంతోషమే. నాకుమాత్రము కరుణించి యీసమయమున నొక్కవరము దయసేయఁగోరెదను.

చిత్ర—నీయిచ్చవచ్చినకోరికఁ గోరుము.

భువ—విశేషమైన దేమియును లేదు. నీభార్య యిక్కడ కరుదెంచినపిదప, నాయనుమతి లేనిది నీ వామెకడ కేగవలదు.

చిత్ర—నీమాట కన్యథా వర్తింతునా?

భువ—నాథా! మనమాయుద్యానవనారామ మందిరమున నొక్కింత కాలయాపన సేయుదము-రమ్ము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

ఇదిప్రథమాంకము.





# కాంతామతి.

## ద్వితీయాంకము.

రంగము:—భువనమోహినిమందిరము.

ప్రవేశము:—భువనమోహిని-చిత్రసేనుఁడు.

భువ—నాథా! నేటిదినమున నీముఖమున నదియొక నూతన వికాసము గన్పట్టుచున్నది. (ఊఁచుకయూరకుండి) ఓహో! మఱచితిని. క్రొత్తభార్య వచ్చుటచే యిందులకుఁ గారణమైయుండును.

చిత్ర—అటువంటి భార్యలు పదివేలమందియైనను నీకుసాటి వత్తురా?

భువ—ఈమాటల కేమిలే!

చిత్ర—నామాట యందు నసత్యమేమియును లేదు.

తే. అవనిగలయట్టి పూఁబోండ్ల ♦ యందు నంద
చందములయందు నిన్మించఁ ♦ జాలినట్టి
పడఁతి లేదంచు ముమ్మారు ♦ పలుకఁగలను
చారుశారదపూర్ణిమా ♦ చంద్రవదన.

నాయొక్క- పురాకృతసుకృతంబునఁ జేసియే నీవు నాకుంపుడుకత్తెవైతివి.

భువ—ఇంతవఱకును నర్ధాంగిగనే భావించుచు, నేఁటికి భార్య

వచ్చుటంజేసి యుంపుడుకత్తెగఁజేసితివికదా? అవును. ఇందు దోషమే మున్నది. నేనుంపుడుకత్తెనేకదా:

చిత్ర—సఖీమణీ! ఈమాటకు నీకుఁ గోపమువచ్చినదా?

తే. గీ. మాటమాటకు నీరీతి ♦ మగువమిన్న
యాగ్రహించుచునుండిన ♦ నాఁగఁగలనె
నాదుసౌఖ్యములకుఁగార ♦ ణంబవీవ
కాదె! నామదినెఱుఁగవే ♦ కమలనయన.

నాహృదయము నీవుమాత్రమెఱుంగకయుంటివా?

భువ—(తనలో, ఈతఁడు నాతోఁ జెప్పనిదే తనభార్యనుజూడ నని పలికియున్నాఁడు—ప్రకాశముగా) ప్రాణేశ్వరా! పెండ్లికుమార్తెను నీవుచూచియుంటివా?

చిత్ర—నీయాజ్ఞలేనిదే నేనెట్లుపోవుదును! నీయాజ్ఞ నాకు శ్రీరామాజ్ఞకాదా:

7 అనుబంధము.

(ద్వారముకడ.)

మహారాజుగారున్నారా! లోపలకు రావచ్చునా?

భువ—ఎవరువారు?

(నేను—గరుడను—రాణియగుకాంతామతి చిత్రపటమును మహారాజునకు గురునియాజ్ఞ ననుసరించి చూపించుటకు వచ్చితిని.)

భువ—ఇదిగో-వచ్చుచున్నాను. (నిష్క్రమించి. వెంటనే చిత్రపటముతోఁ బ్రవేశించి)

8 అనుబంధము.

ఆహా! ఇట్టియందచందములు గల సుందరవదన నెందును జూడ లేదు. ఇట్టిజగన్మోహనరూపిని చిత్రసేనుఁడు వీక్షించెనేని, నాకు

స్వస్తివాక్యము చెప్పుట నిశ్చయము. కావున నేనెట్లయిన నీమె యందాతనికసూయకలిగింపవలెను. నెమ్మదిగా నే నీమెకంటియందు సున్నమును నంటించి, గ్రుడ్డిదానిని వివాహమాడితివేమి యని పరిహసించెదనుగాక—(చిత్రపటమునకు కొంచెముసున్నము రాచి చిత్రసేనుని సమీపించును.)

చిత్ర—నారీమణీ! సాగరుఁ డరిగెనా! ఇంతసేపు వానితో మాట్లాడుచుంటివేమి?

భువ—మాటలకేమియున్నవి? కాంతామతి చిత్రపటమును గురునివంపున నీకుఁ జూపించుటకుఁ దెచ్చినాఁడు. అందులఁగూర్చి విచారించుచుంటిని.

చిత్ర—విచారమేల?

భువ—ఇదిగో! చూడుఁడు! (చిత్రపటమును జేతికిచ్చును!)

చిత్ర—(చిత్రపటమునుజూచి) ఛీ! ఇది యేమి?

తే. గీ. తరుణసౌందర్యవతియంచు గురుఁడు బలుక
నమ్మి వివాహకాంక్ష బడితి నాతి నకట
కాని, యంధురాలంచును గానరైతి
మోసపోతిని మఱియింత మోసపోతి.

ఇప్పుడు నేనేమని విచారించిన నేమిప్రయోజనము!

చ. గురుఁడు, మదీయసౌఖ్యములఁ గోరినయట్టిహితుండుగా నిరం
తరమును నెంతుగాని యిటు తద్దయునుష్టచరిత్రుఁడౌచు, నీ
తరుణిని బెండ్లిసేయుమని తామరసాక్షి! యెఱుంగనైతి; దు
ష్పరిభవమెంతొ కూర్చెనృప సంతతిలోనిఁక నేమిసేయుదున్,

వివాహమొల్లనని భీష్మించియున్న నాచిత్తమును నెట్లో సమ్మతింపఁ జేసి, తుదకొకకన్నుఁ గ్రుడ్డిగానున్న యువతిని నా కాగురుఁడు వివా

హము చేసెనుకదా! ఇట్టియకార్యము చేసినయాభూసురుండు గురుండేయగుఁగాక! శిష్యార్హుఁడే! నేనిప్పుడే మదీయకృపాణమున నాతని శిరంబుబలిగా నర్పించెదఁగాక - (పోబోవును.)

భువ—నాథా! బ్రహ్మహత్యాపాతకముగట్టుకొందువా యేమి? చాలుఁజాలు.

చిత్రి—రమణీ! అట్టిదుష్కార్యమాచరించిన యాబ్రాహ్మణాధమునినేమి చేయుమందువు?

భువ—ఇప్పుడేమిచేసినను బ్రయోజనము లేదు. విధికృతమునకు వగచుచు నిష్టముండెనేని. యాకాంతామణితోఁ గాఁపురము సేయుఁడు

చిత్రి—ఏమి! ఆకురూపిణితో నన్ను గాఁపురము సేయుమని పలుకుచుంటివా?

తే. గీ. గురుఁడు నామెడగట్టిన గుడ్డిముండ
తోడ నాకాఁపురము సేయఁ జూడుమంచుఁ
బలుకుచుంటివరరె! సరి వారు జూచి
నగరె; తగునె యియ్యది నాకు మగువమిన్న.

భువ—అట్లయిన నిప్పుడామె నేమి సేయుదురు.

చిత్రి—ఏమిచేయుదునా? చెఱసాలబోలు నొక గృహంబునఁ బడవైచియుంచెద.

భువ—ప్రస్తుత మట్టి పనియే బాగుండును. ఇంచుక యూరకుండి) నాథా! నీవామె కేవిధమయిన హానియుఁ గలుగఁ జేయవలదు.

చిత్రి—రమణీ! నాచిత్తమున నది యొకవిధమగు నారాటము కలుగుచున్నది. ఇంచుక శయనించెదఁగాక. రమ్ము—

(ఇరువురును నిష్క్రమింతురు.)

రంగము :—[మందిరమున—కాంతామతి విచారముతో ప్రవేశము.—]

9_ అనుబంధము

కాంతా—హా! పరమేశ్వరా! నేను నీయెడల నేమి మహాపరాధము జేసియుంటిని. నిరంతరము నీచరణసేవ జేయు నాకీదుర్గతి గలిగింప నీకు ధర్మమగునా ?

చ. శరణము బొందువారలను ˡ జక్కగ నేలుటఁ జెల్లియుండుట నీ
చరణసరోరుహంబులను ˡ సంతతమున్ భజియించువాకు నీ
కరుణని ఘోరనీచగతిఁ ˡ గల్పన జేసితి వేమనందు; నా
దురితమదేమి! తెల్పుమికఁ ˡ దోఁచకయున్నది! దీనరక్షకా.

సుందరవిగ్రహుండును, నరపాలుండును, నగు చిత్రసేనునకు భార్యనైతినికదాయని సంతసించితినిగాని యిట్లగునని కలనైనందలంపనైతినికదా! (పతినుద్దేశించి)

సీ. నరపాలకుండవై ˡ వరలుచుండిన నీవు
కులటనొక్కతె నుంచు ˡ కొనుటయేమి
యుంచుకొంటివిగాక ˡ యుర్వీశపుత్రినై
యలరు నన్ బెండిలి ˡ యాడుటేమి
యాడినాఁడవుగాక ˡ యనురాగమును జూడ
కీవిధి చెఱసాల ˡ నేయుటేమి
వేసినాఁడవుగాక ˡ విరిబోఁడి కుశలంబు
నొకసారియును జూడ ˡ కుండుటేమి.

తే. గీ. హా! మనోనాథ జితచంద్ర ˡ హా! సురూప
నన్ను నీగతిసేయుట ˡ న్యాయమగునె
కలదె యపరాధమిప్డు నా ˡ వలన నింత
యైన! గాకయుండిన నిట్టు ˡ లరయనేల.

రాజకులపవిత్రుండవగు నీవు వేశ్యనుంచుకొన్న సంగతికి లోకులు నవ్వెదరనియైనం దలంపకపోయితివే. పోనిమ్ము, నిసాక్షిముకోఅకు వేశ్యనుంచుకొంటివిగాక. మీమైత్రికి మీయనురాగమునకు నేనేమి భంగము గావించితిని! నిన్ను వేశ్యాగృహమునకరుగవలదని వారించితినా? నాపై నింత నిష్కరుణ వహింపనేల? అగ్నిసాక్షిగం గైకొన్న యతివ నీరీతి దుఃఖపెట్టుటధర్మమా? (భువనమోహిని నుద్దేశించి) గణికా! భువనమోహినీ!

మ. తొలిజన్మంబునం జేసినట్టి సుకృతస్తోమంబునంగాదె భూ
తలనాథాగ్రిణిం జేరి యీవిధి సమస్తదివ్యభోగంబులన్
బలుమోదంబున బొందుచుంటి వహహా భాగ్యంబు నీదే కదా
కలికీ! నిన్ను నుతింపంగాం దగును నిక్కంబిద్ది వారాంగనా.

మీకులమువారి కుండునైంద్రజాలికవిద్యాప్రభావంబున నానాథుని నీవలలో వేసికొంటివి. మంచిదే. కాని, మాకును మాకును నెడబాపితివేల? ఇదినాకర్మఫలమా, లేక నీప్రభావమా! ఇది నీప్రభావమే యైయుండును.

(సాగరుండు—ప్రవేశించును.)

సాగ—అమ్మా! చింతించినందువలనం బ్రయోజనము లేదు.

కాంతా—సాగరా! నాకర్మమున కేమని వగతును! నావంటి నిర్భాగ్యురాలు బ్రదికి యుండినందువలనం బ్రయోజనమేమియున్నది. మహారాజును భర్తగా వడసితినని సంతోషించితిని గాని, యీకులటయగు భువనమోహినిమూలమున నిట్టిగతి సంభవించునని యెన్నడుం దలంప లేదు.

సాగ—దిక్కుమాలినవబుండ—ఆభువనమోహిని మారాజుగారి కెక్కడ దాపరించినదో పిల్చి పిప్పిచేయుచున్నది. తల్లీ! నీకొడ నిట్టియసూయ గలిగించిన దా కులటయే. ఆగణిక చచ్చినదో సం

దటికిని సౌఖ్యముకలుగును. ఏమఁగిడీమహాలక్ష్మి యైన దానిని మీఁ గివేసిన బాగుండును.

కాంతా—సాగిరా! నాకర్మమున కాకాంత యేమి సేయును? అయినను నది నాయందు గరుణించెనేని, నాభర్తకు నాయందను రాగము జనించును. కావున నీవు నాయందు గృపాంతరంగుఁడవై, భువనమోహిని కడకరిగి,

సీ. ఆఁడువారలజన్మ మన్నదియందటి
దౌర్భాగ్య విధమున నే యుండుననుము
భర్తకు నామీఁదఁ బరమానురాగంబు
గలిగించుమార్గంబు గాంచుమనుము
నీసౌఖ్యమునకెప్డు నేఁ గ్రొత్తరాకుండ
భవదాజ్ఞఁ దలదాల్చి వరలుదనుము
వేశ్యవైనను నీకుఁ బృథ్వీశపుత్రినై
నేను నమస్కార మిడితిననుము.

తే గీ. తనకుఁ జేతకానిపని భూధవునియొద్ద
లేదనుము; నేను నీకడ వాదమెపుడు
సేయుదానగాననుము; నీ చిత్తమందు
భవ్యకృపఁజూపి నన్నుఁ గాపాడుమనుము.

సాగ—నేనాభువనమోహినితో నిన్నుఁగూర్చి చెప్పుటకానంతయు సందియము లేదు. కాని, యాపెంకిముండ నీగోడనను వినునా?

ఉ. ఎందటికొంప లార్పె మటి యెందటి జీవములన్ హరించె; యా
యిందునిభాస్య వారజల జేక్షణ మా నరపాలచంద్రునిం
బొందఁగఁగల్గి సర్వమును బోవఁగఁ జేయుచునుండి; యిప్పుడే
మందును బెట్టెనో నృపతి మానసమంతయు ద్రిప్పిఁ గోపము
న్బొందఁగఁ జేసె నీపయిఁని నుంగన నాకును జాలిపుట్టెడున్ ..

అయినను నేనాభువనమోహినింజేరి శక్తివంచన లేకుండ, నీవిషయమామెకుఁ జెప్పి చూచెద. పిదప భగవంతుఁడున్నాఁడు—నీవు చింతింపక ధైర్యమున నుండుము.

కాంతా—సాగరా! ఎట్లయినను భువనమోహినితోఁ జెప్పి, నానాథునకు నాయందుఁ బ్రేమ పుట్టునట్లు చేయుము. నీయుపకారము నేను మఱువను.

సాగ—తల్లీ! నేసరిగివచ్చెద.

(తెర వాలును)

రంగము:— భువనమోహిని మందిరము—భువనమోహిని

ప్రవేశము:—

భువ—(తనలో) నేను చిత్రసేనుని యొద్దఁ బన్నుచున్న ప్రతితంత్రము సాగుచునే యున్నది. అతఁడు నామాటవిని కాంతామతి మొగంబైనఁ జూడక బాదిగముంనుబడవైచినాఁడు. వేశ్యలకుఁ జేతకాని కార్యములున్నవా! వేశ్యబాఱింబడిన యేవిటుఁడు సన్యాసిగాకుండ దప్పించుకొని పోవఁగలిగినాఁడు! చిత్రసేనుని యొద్దకు నేను వచ్చినది మొదలు నాతనికి నుంపుడు కత్తెనై యుండుటయేగాక, రాజకార్యములవిషయములయందుగూడ నాతోఁ జెప్పకుండఁ జేయకుండునట్లు చేసి యొక బొమ్మలాగున నాతని నాడించుచున్నాను. ఇదికదా నామాయ.

సీ. ఇట్టె మూతిని బిగి రించినంతనె చూచి
ప్రేమజూపునటంచు వేఁడుచుండు
కోపంబునటియించి తాపమందుచునున్న
మధురభాషల బ్రతి మాలుచుండు
నగలిత్తు లేనట్టి వగపుజూపినవమ్మి.

వలసినవస్తువుల్ బంపుచుండు
మాయకాండవునీవు మమతయేటికియన్నఁ
జిత్తమందునభీతిఁ జేర్చుచుండు.

తే. గీ. నిన్ని యేటికి సర్వంబు నేనెగాగఁ
దలఁచి, నాచేతి కీల్బొమ్మ వలెను నట్టు
లాడగాఁ జేసినమునబ్లె యాడుచుండె
భళిర ! యీచిత్రసేనభూ పాలవరుఁడు.

ఇప్పటికీతని ధనాగారమున నున్నధనమంతయు నైపోయినది. నేనును తగిన జాగ్రత్తయందే యుంటినికదా—

(సాగరుఁడు ... ప్రవేశించును.)

భువ—సాగరా ! నీరాకకుఁగారణమేమి ?

సాగ—(తనలో) ఈముందటి నేవో నాలుగు చల్లనిమాటలాడి కాంతామతియందుఁ బ్రస్తుతము దయాపుట్టునట్లు జేయవలయును (ప్రకాశము) ఓహో ! నీవు గణికాంగనవైనను, రాణులకుండు కళలు నీమొగమున నున్నవి. నీయదృష్టము వర్ణించుట కా శేషునికైనఁ దరముగాదు. అందుకనే రాజుగారు నీయందంత బద్ధానురాగులై యున్నారు.

భువ—సాగరా ! రాజుగారు నాకడ నిట్లుందురని మంత్రిమొదలగు ప్రముఖులకుఁ జాలకోపముగా నున్నదని వింటినే,

సాగ—అది వట్టిమాట; మంత్రులుగూడ నీయాజ్ఞ సుగ్రీవాజ్ఞగనే పాలింపఁదలఁతురు—

భువ—పాపము! కాంతామతిని జూచుటకు మాత్రము రాజుగారు పోవుచుండుట లేదు ! ఇందులకుఁ గారణము నేనని యామె నన్నేమి దూషించుచున్నదో!

సాగ—రామ రామ! ఆమె యట్టిది కాదు. మహా రాజుగారు తనకడకు రాకపోవుట తన పురాకృతకర్మమని వగచుచున్నది. కాని యెవ్వరిని దూషించుటలేదు. మహారాజుగారు నిరంతరము నీగృహమునందే యుండుట నీపుణ్యమని సంతోషించుచు, నెట్లయినను దనయందు మహారాజునకు దయపుట్టునట్లు చేయుమని నిన్ను బ్రతిమాలుకొనుటకు నన్ను బంపినది. నీకు నమస్కరించితినని కూడ జెప్పుమన్నది. (ఇంచుక యూరకుండి) ఆమెదుస్థితిఁజూచిన నాకే మిగులజాలియగుచున్నది. కావున నీవు దయబూని రాజుగారితో నా మెవిషయమై చెప్పుము. నీవుతలంచుకొన్నచో నెట్టికార్యమునైనను చేయఁగలవు. నీకు చాలాపుణ్యముగూడ నుండును.

భువ—నిశ్చయముగా కాంతామతి యిన్నివిధముల బ్రతిమాలినదా?

సాగ—అసత్యము చెప్పుటకు నాకేమియవసరము.

భువ—సరే! నేను రాజుగారితో మాట్లాడెదనులేనీవరుగుము.

సాగ—(ఈవలకువచ్చి తనలో) ఆహా! ఈనృపాలుఁడెంత యవివేకి!

తే. గీ. ఒక్కగణికాంగనకు నిట్లు ♦ జిక్కి ముందు
వెన్కలరయక యక్కటా ♦ వెఱ్ఱియగుచు
నదియె మోహంబుఁబెంచును ♦ నాత్మఁదలఁచి
నిజసతినయినఁ జూడక ♦ నొగడుచుండె.

(ఈతనికెప్పుడు బుద్ధివచ్చును! సాధ్వియగు కాంతామతి నయనజలప్రవాహమైన, యీమాయలమారిభువనమోహినిని ముంచివేయరాదా!(

(నిష్క్రమించును)

భువ—(తనలో) తనకడకు నాథుఁడు వచ్చుటలేదని కాంతామతి విలపించుచున్నదఁట; క్రమముగా నీమె రోదనముహెచ్చెనేని, పెండ్లివలదన్న చిత్రసేనునకుఁ బెండ్లిచేయించినట్లే, యెవ్వరోయొకరు బయలుదేరి నృపాలుని చిత్తమామెపై కేగునట్లు జేయుదురు. అప్పుడు నేనుచేసిన మాయయు వెల్లడియగును. కావున నిప్పుడే నేదో మాయఁ బన్ని రాజుతోఁ జెప్పి, కాంతామతిని నరణ్యములకుఁ బంపివేయునట్లు జేసెదఁగాక.-(ఎదుటఁజూచి) అడుగులచప్పుడు వినవచ్చుచున్నది. రాజువచ్చుచుండెను కాఁబోలు. నేను లేనిపోని దుఃఖము నటించుచునుండెద.

(చిత్రసేనుఁడు ప్రవేశించును)

చిత్ర—భువనమోహినీ!

భువ—(మాట్లాడకయుండును)

చిత్ర—నారీమణీ! పలుకవేమి! (సమీపించి)

తే. గీ. భానుదీప్తికి మిక్కిలి వాడియున్న
వల్లిభంగి నీముఖమిట్లు వాడెనేమి
దుఃఖమొదవిన విధమును దోఁచుచుండె
జెప్పుమీ కారణంబురా జీవనేత్రి.

భువ—మనోహరా! నాకీగోలయంతయు నెందుకు? నేఁటినుండి నీవు నామందిరమునకు రావలదు. ఆకాంతామతి మందిరమునకే పోవుచుండుఁడు ఈయపవాదము నేను భరింపఁజాలకున్నాను.

చిత్ర—అపవాదమేమి? నిరంకుశప్రభుఁడనగు నాకొకరితోఁ బనియేమున్నది!

భువ—నిరంకుశత్వము రాష్ట్రముమీఁదనే గాని, యింటిలో భార్యయొద్దఁ బనికిరాదుకదా!

చిత్రి—నీమాటలలో నర్థము తెలియుట లేదు.

భువ—అవును మీకుఁ దెలియదు. మీరు పైకి నాయెడల నను రాగము సూచించుచు, మీభార్యయగు కాంతామతిచే నన్ను దిట్టించుచున్నారు.

చిత్రి—అక్కటా! ఇది యేమి పాపము!

భువ—పాపమో తాపమో, నేను మిమ్ములను వలవేసికొంటినని, కట్టఁబడిన సేవకుల యెదుట నన్ను మీ కాంతామతి, యుచ్చరింపరాని దుర్భాషలాడుచున్నదఁట. ఈగోల నాకేల. నాదారిని నేను పోయెదను. మీరు సుఖముగా నామెం గలసి యుండుఁడు-

10 అనుబంధము.

చిత్రి—రమణీ. ఈమాటలలో నేమి యేమున్నది! నాహృదయము నీవెఱుంగవా? ఏమీ! గుర్రమువచ్చి పిల్లను వెక్కిరించినదనునట్లు నిన్ను గాంచి మెచ్చివచ్చిన యా కాంత నిన్ను దూషింపసాగెగా-నలువురు నేమనుకొందురోయని, యిష్టములేకపోయినను. దానిని వేఱొక మందిరమున నుంచితిని. (ఇంచుకయూరకుండి) సుదతీ! అది నిన్ను దూషించుచున్నట్లు నీకెట్లు తెలిసినది?

భువ—ఎట్లు తెలిసినదని యడుగనేల? పరిచారికలందఱును జెప్పుచునేయున్నారు. అదియట్లుండనిండు. నా చెలికత్తెయగు శారద యామెయుందిగమున కెందులకో పోవ, యామె దానింజూచి "నీవు భువనమోహిని చెలికత్తెవుకావా? కులటయగునది మాయలచే రాజును వంచించి నాకిట్టిపాటుదెచ్చినదిక దా- దానికి వినాశకాలము సమీపించినది లే! ఇఁక నెన్నాళ్ళేమురిపెము"- అనిపలికినదఁట.

చిత్రి—

చ. వనజదళాయతాక్షి వగ కేవంబని యేటికి, నాకుఁ బ్రాణమై
తనరెడునిన్ను నాసుదతి కే తద్దయుదూషణ జేసెగా, యిఁకఁ

వనితకు నెట్టిశిక్షను నొ । నర్పగఁబంచెదొ నన్నుఁబంపుమీ
చనియిపుడే యొనర్చెదను । సంతసమెంతయు నీకుఁగల్గగన్

భువ—(తనలో) ఈతఁడు నామాయలోఁబడుచున్నాడు.

చిత్రి—ఆకాంతామతియే కాదు. నిన్నుదూషించినవారంద ఱును దండనార్హులే.

భువ—నాథా! నామూలమున నీరామెను దండింపనేల? ఈబాధయంతయు నాలోడనే యున్నదికదా! నేఁబోయిన సంతయుఁ జక్కఁబడును. అంతియేగాని యీయామె దూరముగానున్నను నాకు సౌ ఖ్యముండదు.

చిత్రి—

తే. మేనఁబ్రాణంబులుండునే । మెలఁత! నిన్ను
విడిచియుండిననాకు; నే । ప్పుడఁతిసిపుడె
ఘోరవనవాటి కంపి నీ । కును ముదంబు
గలుగఁజేసెద నమ్ముమీ । కలికిమిన్న
ఇంక నీవిందుకు మాఱుపలుకవలదు- రమ్ము-

(చేయిపట్టుకొని లోపలికిఁదీసికొనిపోవును.)

ఇది ద్వితీయాంకము.





# కాంతామతి.

## తృతీయాంకము

రంగము:—అరణ్యము:-

(కాంతామతి యొంటరిగా విచారముతోఁ బ్రవేశించును)

అనుబంధము 11

కాంత—హా భగవంతా! నాకిట్టిసంకటములు గలిగించితివి! మహారాజుగర్భమునఁబుట్టి మహారాజును బెండ్లియాడిన నాకిట్టికష్టము రావలసినదేనా?

సీ. చిత్రసేనునకేను ॥ చిగురుబోఁడినినైతి
నంచును మోదంబు ॥ నందినాను
మహారాజు సతినైతి ॥ మహితకీర్తిని
నింక బొందుదునంచు ॥ నెంచినాను
పరిచారికాజనుల్ ॥ నిరతంబుసేవింప,
నలరారుదంచును ॥ దలఁచినాను
యలశచికంటెను ॥ నమితభోగంబుల
నందుదునని ముదం ॥ బందినాను

గానియీరీతిదుర్ఘట । కష్టములకుఁ
బాలుపడి; చేసికొన్నట్టి । భర్తచేత
నగరమునువీడి వెడలంగ । నడపఁబడుదు
ననుచుఁగలలోనననైనను । నరయనైతి.

శుద్ధాంతసౌధంబులయందు వసించు నాకీయరణ్యవాసమా. అయ్యో? ఇప్పుడు నేనెందుఁబోవుదును. నాథుండగు నరపాలుని యాజ్ఞ ననుసరించి భటులు నన్నిచ్చట డించి యరిగినారు.

ఉ. నా యనువారు లేని విజ । సంపుటరణ్యమునందు నిప్పుడ
య్యో! యెటులుండనోపుదు, మహోజ్జ్వలసత్కృపనన్ను బ్రోవఁగా
నీయెడ కేఁగువచ్చెద । రిఁ । కేమియొనర్తును, దిక్కునాకు వే
రేమెవరీ మహాటవిని । శ్రీహరిగాక మదిందలంపఁగన్.

(భువనమోహిని నుద్దేశించి) హా! భువనమోహినీ నేను నీయెడల గావించిన తప్పేమున్నది. నానాథునకు నాపై నైటనున్న దయగలుగు మార్గము చూపవలసినదని నిన్ను బతిమాలుకొనుచు సాగరునిచే వార్తపంపితినికదా! నాచిత్తవృత్తి నీ వెఱుంగ లేకపోయితివికదా! నాథుడు నీమాటవినును గదా యని తలంచి. నాకీరీతి సెలుగులగల్పించుటనీకు ధర్మమనితోఁచెనదా! నీతో సమానముగ భాగ్యభోగములు లేకపోయినను బతిసేవనైన జేసికొని కృతార్థురాలనుగాఁ దలఁచితిని; అక్కటా! నాపై నీవింతసిర్గయవహించితివేల? సవతియని యసూయ జెంది యిట్టి యకార్యము జేసితివని తలంచినను ప్రాణేశ్వరుని దివ్యమంగళ విగ్రహము నొకసారియైనను దర్శించియుండ లేదే, నాథుఁడు నన్ను జూచుటకే నీయాజ్ఞాబద్ధుఁడై రాకయుండెనే! అట్టిచో నావలన నీకేమి భయమొదవినది. (చిత్రసేనుని నుద్దేశించి) హా! నాథా!

సీ. భువనమోహినితోడ । సౌందేలయందుచును
వారించియుంటినా । భాసురాంగ

కులటతోఁ స్నేహంబు గూడదంచును నీకుఁ
జెప్పియుంటిననేను క్షితితలేంద్ర
యకాంతతోఁ బాటు ననురాగమునన్ను
వీక్షింపుమంటినా విమలచరిత
రాజకార్యముల మఱచియుంటివంచును,
బోధించియుంటినా పుడమిఱేడ

తే. గీ. ఎప్పుడపరాధమింతైన నెఱుఁగనట్టి
యబలనగునన్ను నీరీతి నడవులకును
బంప ధర్మమా! నీకు భూపాలమౌళి
కటకటా! నాగుణంబును గాంచవేల.

ప్రాణేశ్వరా! ఇది నాప్రారబ్ధమని తలంపవలెను. కాకున్న ఆగర్భశ్రీమతురాలనగు నాకీయరణ్యవాసమేమి? నాథా! సౌఖ్యభోగంబులకు దూరంబయితినని నేను చింతింపను. వైభవముతోఁ దులదూగుటకై చింతింపను. కాని నీపదసేవ నాకు లభింపలేదనిమాత్రము దుఃఖింతును (ఇంచుకయూరకుండి) మనోహరా! నన్నీ ఘోరారణ్యమునవిడిచి పెట్టించుటకన్న నీకృపాణముచే నన్నువధించియున్నచో నాకీదుఃఖము లేకయుండునుకదా! (ఇంచుకయూరకుండి) ఈయరణ్యమున నెచ్చటికిఁ బోవుదును. (ఇంచుక నడచి) అదిగో! తెల్లవారవచ్చుచున్నది. (ఆకాశమువంకఁజూచి)

తే. గీ. జనులపరితాపమునుగోలు సర్వసాక్షి
భక్తవర్యులపాలిక ల్పద్రుమంబు
సర్వజాడ్యాపహారి, యా బ్జాతహితుఁడు
ద్యుమణి, దోచుచుండెనదిగో యుదయశిఖరి,

(ఇంచుకనడచి) సూర్యభగవానుఁ డుదయించి జగమునకు తేజము కల్గించినాడు. (అటునిటు జూచుచు)

సీ. చలిదిమూటలుభుజం । బులపైఁదాల్చి గో
పాలబాలురు వేగ । వచ్చుచుంట
అంబారవంబుల । నాచరించుచు ధేను
సంతతియాదారి । జనుచునుంట
కనుచూపుమేరను । శునకారవంబులు శ్రీ
వణములకువినఁ । బడుచునుంట
చేతకఱ్ఱలుబూని । శీఘ్రగమనమున,
చేలకు కాపులు । చేరుచుంట
చూడఁ దలదాచుకొనుటకై । సొంపుమీఱు
పల్లెయొక్కటి యున్నట్టి । భంగిఁదోఁచు
నెట్టులైనఁ దానిని జేరి । యేదియైన
మార్గమరయంగవలయును । మానసమున

(ఇంచుక నడచుచున్నది.)

(ధనపాలుఁడు—ప్రవేశించును.)

ధన—(తనలో)సూర్యుఁడా కాశాన్నెలుగుతున్నాఁగాని, సలితగ్గ లేదు. ఆడిజిమ్మె తిమ్మ-అమాలముండాకొడుకు బాకీయిచ్చి సావడానికి నాయెవ్వరకలు కొఱికేస్తున్నాఁడు. పొద్దున్నే యెత్తేనేగాని ఆడు సిక్కడు (ఇంచుకి నడచి కాంతామతిని జూచి) యేంటిది. కళ్ళకు తళుక్కుమంది (చూచి) యేవిటోఁఅనుకొని ఖంగారడ్డాను. ఆ! మన్నే అబ్బో! యీలాంటిమనిసిని యెక్కడ సూడలేదు. ఇది బెమ్మసృష్టి కాదు. యెంటవకూలేనట్టుంది. ఈవిడ యీలా వొంటిరిగా నచ్చిందేవో-కసింత మాట్లాడిద్దాము. (సమీపించును).

కాంతా—(తనలో) ఈతఁ డెవ్వరో నన్ను సమీపించుచున్నాఁడు.

ధన—(ప్రకాశముగా) మందేవూరేవిఁటి, ఇల్లాయొంటరిగా ప్రయాణం-యెంట మొగాళ్లు లేకుండా రావటవేమిటి? నీసంగతి కూంత సెప్పు.

కాంతా—అయ్యా! నీవెవ్వరవు?

ధన—నేనా! అదిగదిగో తిన్నగాసూడు. వూరుకనపడుతుందే ఆవూరుమాది నేనాగ్రామములో పెద్దసెట్టిని తెలిసిందా?

కాంతా—అయ్యా! నాయవస్థయేమని చెప్పగును. విధికృతమున నిట్లొంటరిగా వచ్చితిని. కావలసిన దిక్కు కలిగినదాననయ్యుఁ బ్రస్తుతము దిక్కులేని దాననైతిని. నెమ్మదిగా నాయరణ్య ప్రదేశమును దాటి యిట్లు వచ్చితిని. ఎందుబోవుటకును మార్గము తోఁచకున్నది.

ధన—(తనలో) ఇందులో యేదో తమాసావుంది. ఇప్పుడు నేను ఆట్టేమాట్లాడకుండా యింటికి తీసికెళ్ళుతాను. తరువాత సంగతి విచారిస్తాను. (ప్రకాశముగా) అయ్యో! పాపము నీకు కష్టంరోజులు వచ్చాయి. వచ్చాయంటా—సందేహం లేదు. సూడు, వచ్చిన దానికేమి చేస్తావుగాని విచారింపక, మాయింటికిరా—నీకేవీభయం లేదు. నీయిష్టవొచ్చినన్ని రోజులుండ పచ్చును. మాయింట్లో డబ్బుకేవీ లోపంలేదు. లోపం లేదంటా—తినేవాళ్ళులేరు. ఇహామల్లిమాట్లాడకు. నేకోవటిని. మంచికులంలోణ్ణి. నాప్రాణాలతో సమానంగా నిన్ను సూసుకుంటా--నాయింటికాడ వుంటే యేవీభయవుండదు.—రా-లే.

కాంతా—(తనలో) ఈతఁడు వైశ్యుఁడు, సద్గుణుండని తోఁచుచున్నది. ప్రస్తుత మీతని గృహమున కేగుటకన్న మార్గమింకొకటి కానిపించుటలేదు. (ప్రకాశముగా) ప్రాణదాతా! నీకు గృతజ్ఞురాలనై యుందును.

ధన—అందుకనేగా—రా.

(నిష్క్రమింతురు)

రంగము:—(ధనపాలుని గృహమునం దొక గదియందు కాంతామతి ప్రవేశించును)

కాంతా—(తనలో) ఈవైశ్యుని యింటికరుదెంచి వారము రోజులయినది. ఇంక నెన్నాళ్లని యిక్కడ నుండుదును. నాజీవయాత్ర యిట్లే గడుపవలయునా? లేక యెన్నటికైన, నాభర్త యనుగ్రహమును వడసి సౌఖ్యంబునందం గలుగుదునా? (ఆలోచించి, ఈనిర్భాగ్యురాలి కట్టి భాగ్యము లభించునా? ఏమయినను నిక్కడ నింక నిలచుట మంచిది కాదు.

ధనపాలుడు—(ప్రవేశించి తనలో) ఈపిల్ల మాయింటికొచ్చినది మొదలు యెప్పటికప్పుడే నాకోక దెలుపుదా మనుకొంటాను. కాని సిగ్గేస్తావుంటుంది. ఇహ సిగ్గు గిగ్గువదిలెయ్యాలి. మగాడికి సిగ్గేమిటి. (కాంతామతిని సమీపించి) మాయింటిలో నీకేమీ యిబ్బంది లేకుండా సుఖంగా వుందికదా భయవేమీ లేదుకదా.

కాంతా—నీవు నాయందు జూపిన కరుణ కనేక వందనములు ఈకాలమున నిట్లు సహాయ మొనర్చు పుణ్యపురుషు లరుదు. నేను నీగృహంబున కరుదెంచి పెక్కు నాళ్లయ్యె. ఇంక ననుజ్ఞ నిమ్ము. పోయెదంగాక.

ధన—అప్పుడే యెళ్లడవే? నీ కేంతక్కువ.

కాంతా—తండ్రీ! యెన్నాళ్లని పరుల యింట నుండఁగలను?

ధన—నన్ను పరాయోడుగా సూడకు. నేను నీవాణ్ణేఅనుకో. అనుకో—అంటా. (ఇంచుక యూరకుండి) నిన్ను సూసినప్పటి సల్లా నాకు జాలేస్తావుంటాది. ఇంతసక్కని సుక్కకీలాంటి గతొచ్చిందికదా అని సింత.

కాంతా—నాయనా! నాపురాకృత కర్మమునకు నీవేమి సేయుదువు.

ధన—అంతే—ధ పాలసెట్టి సామాన్యుఁడనుకొన్నావా యేమిటి. నమ్మినోరిని సెరపకు. సెరపడఁటా- తెలిసిందా. (సమీపించును)

కాంతా—(ఇంచుకయవతలకేగును)

ధన—అదిగదిగో-నన్ను సూసి బెదురుతావెందుకు. నేను పరాయోణ్ణి గాను యుండాకే సెప్పేస్తిని. నువ్వు దూరంగా యెళ్లితే నామనస్సు నిలవదు.

కాంతా—(తనలో) వీనికేదియో పుంసు పుట్టినట్లున్నది. నిశ్చయముగా నితఁడు నాయెడల దుర్బుద్ధినిఁ బూనియున్నచో నేనేమి సేయుదును! అన్నిటికిని, బరాత్పరుఁడే నన్నురక్షించుఁగాక.

ధన—మహాఆలోచిస్తున్నావు. ఇహ దాపటిక వెందుకు. నీయందం సూశేటప్పటికి, నావొళ్లు నిరయిపోయింది. ఇహబతికే యెత్తు లేదు. నేను యీవూళ్లో పెద్దసెట్టినని నువ్వు విన్నావుకదా. నగలకి నా డెనులకి- సుఖానికి భోగానికి యేమీలోటులేదు. నువ్వు గుప్పు సప్పు కాకుండా నాయింట్లోవుండు. నిన్ను సూస్తే నాకొదలబుద్దెయ్యడం లేదు.—సూడు—సిహాస్యము తెలిసిందా—ఇంక నీసిత్తం నా బాగ్యం!

కాంతా—(తనలో) అక్కటా! ఈదుర్మార్గుఁడు నన్నుగా మించి నాడు నేనెట్లు యిన సితనికి నెమ్మదిగా నీతి జెప్పి యీదురుద్యోగము నుండి విముఖునిగాఁ జేయవలయును—(ప్రకాశముగా) నీవు నాకుఁ దండ్రివంటివాడవు. దిక్కులేక, పూర్వకర్మముచే నడవిపాలైయున్న నన్ను నీగృహమునకు దెచ్చి రక్షించితివి. అట్టినీవు, పరకాంతను, సాధ్వినగు నన్ను గోరుట ధర్మము కాదు. తెలిసియో లేక యవివేకముచేతనో కోరితివి. ఇకనైనను నీబుద్ధిని మరలించుకొనుము. నీకు శుభంబగుగాక—

ధన—సిత్తవే మరలించుకోను? శంద్రుమడిలాగున్న సెముగం—సెంగల్వలలాగవున్న కళ్లు-యియన్ని సూస్తే యెట్టయికారం పుట్టుకొ

స్తూంది-భగవంతుఁడు నిన్ను సేసిన సితా్రనికి ఆచ్చర్యం వేస్తూంది ఇహా మల్లీ మాటాడక నామాట ఇనుకో- యినుకో-అంటా-నన్ను సేదా వంటే ఇహా సెప్పడ మెందుకు-నీకే తెలుస్తుందిగా-కోవటిసెయ్యి కోటిలా బాలన్నారు. (సమీపించును)

కాంతా—దూరముగా నుండుము. (ఇంచుకయూరకుండి) నాయనా. పరకాంతారతి కడుపాపమని పెద్దలాడు వాక్యములు నీవు వినలేదా! అట్టి దురుద్యోగమునఁ బ్రవర్తించు నారి కాయురారోగ్యైశ్వర్య కీర్తులునశింపఁజేయే గాక, ఘోరనరక కూపమునఁ బడఁగలరు. ఇదియట్లుంచుము.

సీ. మాయ కాయంబిది । మట్టిబొమ్మయనుమా
కన్నుల వీక్షించి । కలువలనుచు
దుర్గంధ కలితమై । తోచుశరీరంబు
మేలిబంగరు వన్నె । మించుననుచు
గూర్పఁ జాలిన గబ్బి । గుబ్బలనుచు నెంచి
యజ్ఞానమునఁ బడి । యట్టివాని
తే. గీ. కాసఁ జెందుచు గనుయూఘు । లైనవారు
కులయశోగౌరవంబులు । గోలుపోయి
తుదకు నరకకూపంబున । దొరలు చుంద్రు
తండ్రి! నీవంటివారికి । దగదు తగదు.

ధన—ఏవిదీ. ఇంకా సెప్పవు. ఇందులో వున్న యవహారం ఇంతే-సీ! రోతపని-అమ్మా! ఎట్టోసునైనె నిన్ను కోరినాను. కాని నీమాట విన్న మీఁద భెవ పోయింది. ఇంకెప్పుడూ అలాటి పనికి పూనుకోను. నన్ను మన్నించాలి. సెంపలేసుకుంటా (చెంపలు వేసికొనును)

కాంతా—తండ్రీ! తెలియక చేసితివి.

(తెరలో కలకలము)

ధన—ఎవరో వస్తున్నట్లుంది

(తెరలో)

అరే! ధనపాల్ శెట్టి ఘర్మే వుండాడ్

ధన—ఎవరాగ (కాంతామతినిఁ జూచి) అమ్మా! ఎవరో వచ్చారు; నీవు లోనికెళ్లు.

కాంతా—(నిష్క్రమించును)

ధన—(ఎదుటఁజూచి) ఎవరో— ఖల్లారండి-

భటుఁడు—(ప్రవేశించి)ఏమ్ వోయి. కోట్బిరా- గుష్టబుద్ధిరా జాకుమాలుంగనై- ఆడికి మాకు జవాన్ కాకుబే, మాట.

ధన—సరి అయితే యేమి-

భటు—అయితే యేమి అంటావు. తుమారాఘర్మే ఏక్ పిల్ల-నబ్జఫరీ వుందని రాజాకు తెల్సింది. దాన్కి ఘర్కాని రమ్మని మాకు హుకుందియే- మాలుం- జల్దీ మాకీఅప్పగించూ-

ధన—ఇదేవిటి—నాయింట్లో యెవరున్నారు. బాగా నేవుంది గోల- ఎవరోమాబంధూలు, ఇదంతా రాజుకెందుకు? వెళ్లు- మాయింట్లో యెవరు లేరు.

భటు—అరే- క్యాబాత్ బోల్తాకే- మాకీసూడలేగు. జూటా భాత్ చెప్తావు ముసల్మాన్ తడాఖా తుంకు మాలుంగనై క్యా-ఖతల్ చేస్తాము.

ధన—అబ్బో— ఖతలు చేస్తావుగా- ఏఖతలు శేశావేవిటి నీకు సతుకుంటేగా ఖతలు సెయ్యడానికి.

భటు—బేజరుగుర్ మాటలుకైకూ- మాకీ పిల్లని అప్పగించు-లేకపోతే•రాజాసర్కార్ నికీ ఖైద్ పెస్తార్.

ధ:—ఓసబ్బో! ఏంబయ వెట్టుండావు, ఖైదంటే మాటలే.

భటు—క్యారేదివాన్ వాలా-

ధన—నువ్వే- దివాలా- నాకేం; నాయాపారం మూడు పువ్వులు ఆరుకాయిల్లాగుంది. మాటంటే వూరుకోంటూ రనుకొన్నావా యేవిటి. నీ మేసాలు నాదగ్గిఱకాదు. వెళ్లు- మాయింట్లోపిల్ల లేదు. జల్ల లేదు.

భటు—అరే- రాజాకి చెప్పాలిమేము. మీయింటికి కొత్తంగా ఆయే నై- ఓపిల్లాకి సాఁయెంటపంపు; నై తో దేఖో- మాతే మీయింటిమే యెల్లి దేఖో పాంచ్ నిమిషంమే లేక్ జాతే- (లోపలికి పోబోవును.)

ధన—ఈదండోరా యేవిటి- యేవిటి అంట-

భటు—అరే పిల్లని పంపుతావు లేదూ- (కత్తిచూపును)

ధన—(తనలో) ఇదేం ఖర్మోనాకు. ఆరాజుపేరుకు తగినట్టే పనులు చేస్తున్నాడు. నాయింట్లో రహస్యం యెల్లాతెల్సిందో- ఇప్పుడు పంపనంటే నాకొంప నట్టేటిలో ముంచుతారు తరువాతసంగతి సూద్దాం. సింపాదిగా ఆ కాంతను రాజుకప్పగిస్తా- (ప్రకాశముగా) సాయిబూ! నువ్వు సాలామంచోడవు. కాని, కూంతకోపం- ఆ అమ్మాయిని నీతో పంపడం బాగావుండదు అందుచేత నేనుగూడావచ్చి మీరాజుదగ్గిఱ దిగయిడిసొత్తాను. తెలిసిందా- తెలిసిందా అంటా—

భటు—అచ్ఛా! ఆవ్ --

(నిష్క్రమింతురు)

రంగము:—(దుష్టబుద్ధి మందిరము. నొకగదిలో కాంతామతి ప్రవేశము)

కాంతా—(తనలో) అక్కటా! ధనపాలుని గృహంబు జేరినను దురుద్యోగముచే బ్రవర్తింపఁదలఁచిన యాతనిచిత్తమును మరల్చినసత్ప థమున బెట్టితికదా యనియు, నింక నేడో రేపో యాతనిగృహము విడి

చిపోవుటకై తలంచుచుండ, నింతలో నాకీకష్టముగలిగెనుకదా. ఈ పురపాలకుఁడు దుష్టబుద్ధియఁట- నేను ధనపాలుని గృహమునవున్న జాడనెఱింగి, బలవంతముగ నన్ను దనమందిరమునకు రప్పించినాఁడు. అక్కటా ! ఈగతి కేమని వగతును. హా! దైవమా! నన్నెన్నివిధములఁ గష్టపెట్టుచున్నావు. సార్థకనాముఁడగు నీదుష్టబుద్ధి నాయెడల నెట్టి దుష్కృత్యము మదిదలఁచియుండునోకదా. ఇప్పుడు నేనేమిసేయుదును. ఈయంతఃపురము వెల్వడి యవతలఁ బడుమార్గమే కానరాకున్నది- ఇక్కడ నన్ను రక్షించువారెవరు?

తే. గీ. ఘోరవిపదబ్ధిలోపలఁ గూలినపుడు
నాస్తికునకైన నెవ్వని నామచింత
యంబుధి విపత్తుఁ ద్రోలఁగు; నా కయంబుజాక్షుఁ
డైన దేవుండు నాకు దిక్కగునుగాక.

ఏమైనను ధైర్యము విడువరాదు- (అడుగులచప్పుడువిని) ఎవరోవచ్చుచున్నట్లున్నది. (పరికించి) అక్కటా! ఆవచ్చునది దుష్టబుద్ధినరపాలుఁడే. వీనిమొగముచూడఁగనే శరీరము కంపమెత్తుచున్నది.

(దుష్టబుద్ధి ప్రవేశించును

దుష్ట—(కాంతామతినిఁజూచి-తనలో)

అనుబంధము 12

ఆహా! ఇట్టి యానందచందములుగల కుందరదనను నేనును జూచి మొఱుఁగిను. ఈకాంతామణి సోయగము నేను విన్నందుకును —కన్నందుకును సరిపోయినది.

చ. ఇలగల సుందరాంగులను నెందఱినో కనుగొంటిగాని, యీ
యలికులవేణిబోలు సతి నేయెందు గననైతిని దీనిజూడఁగా
నలసుమబాణుఁడెంతయు నహంగ్రహమూని శరాగ్నిలోననుం
మలమల వేపఁగాఁ గడఁగె మానిని యే శరణంబు నాకిఁకన్-

నాదిత్తవృత్తి నెఱిఁగించితి నేని, యీమె నా యభీష్టముఁ దీర్చుటకేల యంగీకరింపక యుండును. (సమీపించును)

కాంతా—(కొంచెము వెనుక కేగును)

దుష్ట—భీతకురంగేక్షణా! నన్నుఁగాంచి నీవు భయమంది వెనుక కేగదవేల ? (ఇంచుకయూరకుండి) నేనెవ్వరినో- నీకుఁ దెలియదా ?

కాంతా—నీవు దుష్టబుద్ధిపరపాలుఁడవని మాత్రము నాకుఁదెలియును. కాని, విధివశంబున, నేనిట్టి దీనస్థితికివచ్చి, ధనపాలుని గృహమునందుండఁగా బలవంతమున నీవు నన్ను, బట్టి యియ్యెడకురావించిన కారణము మాత్రము నాకుఁ దెలియదు-

దుష్ట—అది తెలియ లేదా ?

తే. గీ భవ్య భవదీయ సత్కృపా । వైభవంబు
గాంచి; తమిదీఱసౌఖ్యభో । గంబులందఁ
గోరి రప్పించితిని నిన్నుఁ । గుందరదన
తప్పుగాఁదోఁచెనేని వర । దయను బోవు.

కాంతా—(తనలో) అహా! దుర్మార్గుఁడెట్లు పలుకుచున్నాఁడు?

దుష్ట—కాంతా! మాటాడవేమి ?

మ. తరుణీ! దాపఁగనేల నీయెదుటమో । దంబారగాఁదెల్పెదన్
వరపుష్పాస్త్రుఁడు నిన్నుఁజూడగ నెనా । పైఁగోపమున్ బూని, భీ
కర నారాచసమూహమిప్పు బఱపం । గాసాగెఁ గావన్ గృపా
పరవై; పక్కకుఁజేర్చి యీమదనుగ । ర్వంబార్పవే సుందరి.

కాంతా—హరి--హరీ—ఎంతమాటబలికితివి-

చ. ధరణి జనాళినెల్లరను । దండ్రివిధంబునఁ జూచునట్టి యీ
ధరణిత లేందఁ్రచందు్రఁడవు । తండ్రియెకాదువు నాకు నట్టిచోఁ
బరసతినైననన్నిటులు । బల్కిన నేమని చెప్పుదాన, నీ
చరితము సంధ్యమైచనదె । సద్యశమంతయు గోలుపోవదే.

నరపాలా! నీరాష్ట్రమున నిట్టి దుశ్చరితులుండిరేని వారిని దండించుటకుమారుగ నీవేయిట్టియకార్యోద్యోగముం బ్రవేశింపం దలంచుట ధర్మమగునా? కంచెయే చేనుమేసిన నేమి చేయవచ్చును. విధికృతంబున నేను ప్రస్తుతమిట్టిస్థితి యందుంటికదా యని తలంపవలదు, నేను సాధ్విని పరదారను.

దుష్ట—(సమీపించుచు) నీమాటలు నా శ్రవణరంధ్రంబులను బ్రవేశింపవు.

మ. వనితా నిన్నెటులైనఁ గూడుటకునై భావించిరావించినా
డను; నాశారీరకదీర్ఘమంచుఁగడువేడ్కన్ నిన్ను బ్రార్థింపగా
వినకున్నావిది ధర్మమౌనె, యికనీవే నన్నుఁ బాలింతొ, గా
కను నేనే నిను జేకొనన్ వలెను వక్కాణింపు నిక్కమ్ముగన్.

కాలహరణమునకు నాచిత్తము సైపదు.

శాంత—(తనలో) ఈదుష్టుఁడు తన హృదయమును పూర్తిగ వెల్లడించినాఁడు. శాంతవాక్యములచే సాధ్యమగునంతవఱకు నీతనిచిత్తము మరల్పఁబ్రయత్నించెద. కాదేని హానిలేనిమత్తి యొకతెఱఁగాలోచించెదఁగాక—(ప్రకాశముగా) రాజా! నీవొకరిచేతబుద్ధిజెప్పించుకొనువాఁడవు కావు. సమస్త విషయములును దెలియును. ఒంటిపాటున నిట్లు చిక్కిన యాబల నీరీతి బలవంతపఱుచుట నీకు శ్రేయస్కరము కాదు; కాదని ముమ్మాటికిని దెలిపెదను. పరకాంతారతికాసఁజెంది యెందఱో మానవప్రాణములు గోలుపోయిరనినసంగతి నీవు పురాణముల యందు జదివియుండలేదా?

సీ. గౌతమమునిసతిన్ గామించిపాకారి
యొడలెల్లకన్నుల నొందినాఁడు
భూపుత్రికనుగోరి పౌలసుదిండులతేఁడు
క్ష్మాపతిరాముచే మడిసినాఁడు

నలు రాణినింగోరి కీచకు లువయైనట్టి శ
ఖరపతి ప్రాణముల్ వాసినాఁడు
సైరంధ్రియంచుఁ బాంచాలినింగోరికీ
చకుఁడు భీమునిచేతఁ జచ్చినాఁడు

తే. గీ. వీరిచరితంబు నీవెప్డు వినకయుంటి
వా! వినియుఁజిత్తమునఁజేర్ప వా! సునీతి
దలఁపవా! మంచిబుద్ధిని దెలుపువారు
లేర! కాకున్ననిటునన్నుఁ గోరదేల.

ఇంక నైనను, నామాటలాలించి నీచిత్తమును మఱల్చుకొనుము—ఇది యంతయు నేల? నీభార్యను మఱియొకఁడు కోరిన నీచిత్తమున నెట్లుండును?

చిత్రి—ఓనారీమణీ! కాముకులకు యుక్తాయుక్తవిచారణ ముండదు—నేను కోరినందుకు సంతోషముతో నాయభీష్టము దీర్చితి వేని నీవందుసౌఖ్యములకు మేరలేక యుండును—లేదేని నన్నిచ్చట వారించుసమర్థులెవ్వరునులేరు బలవంతముగనైనను నాయభీష్టము నేను తీర్చుకొనఁగలను.

## 13 అనుబంధము.

కాంతా—(తనలో) ఈతఁడు దుష్టచరిత్రుఁడు—నేనెంత చెప్పినను వినఁడు—కావున నీతని నెట్లయిన వంచింపవలయును. (ప్రకాశముగా) రాజా! ఇంతతొందరయేల! నీవు దూరముగనుండి నావిన్నప మొక్కటి యాలింపుము.

చిత్రి—అట్లనే—సత్వరముగఁ జెప్పుము,

కాంతా—నీపైనాకు మోహము లేకపోలేదు. కాని ప్రయోజనమేమియున్నది?

చిత్రి—నిశ్చయముగా నాపై నీకు మోహామున్నదా?

కాంతా—ఉన్నది.

చిత్రి—ఉన్నచో నాకోరిక వెంటనే తీర్పక, యిన్ని పలుకులు పలుకుచుంటివి.

కాంతా—నరపాలా! నేను పెక్కుదినములనుండి యిట్లేకాకినై చరించుచుంటిని. నామనమున నొక యభిప్రాయమున్నది. దానిం దీర్చినవానిని గైకొందునని నియమము; నీవు సుందరాంగుఁడవు. నాకుఁ దగినవరుఁడవు కాని, నాకోరిక దీర్పఁగలుగుదువో లేదోయను సందియము కలుగుచున్నది.

దుర్బు—నీకోరిక యెట్టిది? నీవు నన్ను గైకొంటివేని ప్రాణమిమ్మన్ననిచ్చెదను—అంతఃపురమునకు పోవుదము—రమ్ము.

కాంతా—బాగున్నది. కోరికయెట్టిదో నీవువినలేదు.

దుర్బు—అదియెట్టిదో తెలుపుము.

కాంతా—నేను గౌరీవ్రతమును చేయవలయు.

దుర్బు—ఇంతియేకదా—ఈమాత్రపుదానికేనా యింతగంద్రగోళము చేసినావు. ఇఁకరా.

కాంతా—ఇప్పుడే—ఆగౌరీవ్రతము నియమము ననుసరించి చేయవలయును. దానికాఱుమాసములు గడవున్నది. నేను వేఱేమందిరములో నుండవలయును. దానికిఁ గావలసిన ధనము నీవు పంపుచుండవలయును. ఈయాఱుమాసములలో నీవామందిరమువంకనైనఁ జూడరాదు. ఒకవేళ నీకెప్పుడయిన దుర్బుద్ధిపుట్టి యట్లువచ్చితివేని, నీవు మరణమందుదువు.

దుష్ట—అబ్బా! ఆఱుమాసముల గడువా? అంతవఱకు నీముఖేందుమండలము చూడకుండ నెట్లుండుగలను. పోనిమ్ము! మాసములు ది

నములుగా మార్చుకొనరాదా ? ఈయాయుదినములలోనే యాయుమానముల కగుద్రవ్యమును వెచ్చింపఁగూడదా.

కాంతా—అట్లు వలనుపడదు—నేజెప్పినదాని కంగీకరించితివేని నన్ను గైకొనఁగలవు.

దుర్బు—కానిమ్ము. ఎట్లో యీయాయుమానములను నోపిక వహించియుండునుదము.

కాంతా—దూరముగా నిలువుము.

(నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.





# కాంతామతి

చతుర్థాంకము.

రంగము:—(భువనమోహిని గృహము—భువనమోహిని ఒంటిగా ప్రవేశము.)

(14) అనుబంధము.

భువ—ఆహా! వేశ్యల బ్రదుకు మిగుల హేయముకదా! చిత్రసేనుని నామాయవలలోఁ జిక్కించి యతని సంపదలనన్నియు హరించితినని కులికితిని. కాని యారీతి నగునని యెన్నడును దలంపనైతిని, అక్కటా! చోరులు నాధనము సర్వమును నొక్క కాసయిన లేకుండ దోచుకొనిపోయిరే—ఇదియట్లుండఁ గాంతామతి విషయమై నేనుచేసిన మాయ చిత్రసేనునకుఁ దెలిసి యతఁడు విరాగుఁడై, కాంతామతినిఁ జూచువఱకు రాజ్యవ్యాపారములఁ జూడనని పలికి పిచ్చివానివలెఁ దిరుగుచున్నాఁడు. ఇదియేసమయమని మంత్రులునన్ని పురినుండి వెడలవలసినదని కఠినముగ నాజ్ఞాపించి యున్నారు. అక్కటా! ఇప్పుడేమిసేయుదును. అంతసొమ్ము నార్జించిన నాకుఁ దుదకు జీవయాత్ర గడుపుకొనుట కేమియు లేకపోయెనుకదా! (ఇంచుక యూరకుండి)

దుర్వృత్తినింబూని యార్జించిన ధనమెట్లునిలుచును! ఎందఱికొంపలా ర్పితిని-ఎందఱ సాధ్వులకు శోకముజేర్చితిని. ఆకాంతామతియెడల నే నుజేసిన పాపకృత్యమే యిట్లు పరిణమించినది. పాపభూయిష్ఠమైన యీజారిణీవృత్తిని మాకులమువారెప్పుడు పరిత్యజించెదరోకదా!

సీ. ద్రవ్యమే నిరతంబు ౯ ప్రాణేశ్వరునిగాఁగ
భావించివర్తించు ౯ భామలార
విటకాండ్రవంచింపఁ ౯ బటుమాయతంత్రముల్,
మితిలేకపన్నెడు ౯ మెలఁతలార
వేళపాళలులేక ౯ విత్తమార్జింపంగఁ
బహువర్తనముబూను ౯ పడఁతులార
మానాభిమానముల్ ౯ బూనకమానంబు
విటులకునమ్ము పా ౯ పిష్టులార
తే. గీ. తగునుమని నడువీధిపై ౯ తక్కులాడు
వెలవెలఁదులార! యీకనాడు ౯ పలుకులవిని
జారిణీవృత్తివర్జించి ౯ సద్యశంబు
గనుఁడు; సంసారుకాచును ౯ గణికలార.

సీ. జవ్వనంబెప్పుడు ౯ శాశ్వతంబంచును
దలపోసిముకిసెదు ౯ తరుణులార
వంచించిగైకొన్న ౯ భాగ్యంబుస్థిరమంచు,
ముదమందిచరియించు ౯ పొలఁతులార
కుటిలులై విటకాండ్ర ౯ కొంపలఁదెగమాపి
నిందలంబొందెదు ౯ నీచలార
కానికార్యంబుల ౯ గావించి తుదకు నీ
చస్థితినందెదు ౯ చానలార

తే. గీ. వలదుమనకింక నీచమా ఽ ర్గపుప్రవృత్తి
యెంతయార్జించినను వీస ఽ మేనినిలువ
దంచు నిశ్చయంబుగవచి ఽ యించుదాన
నమ్మ్మడీ వాక్యముల వార ఽ నారులార.

(నిష్క్రమించును.)

(చిత్రసేనుఁడు—ప్రవేశించును.)

చిత్ర—హా! అతిదుష్కరము! దారుణము! కష్టము!—
అక్కటా! ఎట్టికష్టకార్య మొనరించితిఁ.

ఉ. క్రూరతనంబున గుసుమ ఽ కోమలివాదగుపత్నినట్లని
ష్కారణమైన యాగ్రహము ఽ గాంచి; ధనాంగనచెప్పినంతనే
ఘోరవనాళికంపితిని ఽ క్రూరుఁడ నీచుఁడ మత్తచిత్తుఁడన్
గౌరవమెల్ల నాశనము ఽ గానొనరింపఁగఁబుట్టితిన్ గటా.

హా! వారనారీ! భువనమోహినీ!

ఉ. కూడదటంచు సద్గురుఁడు ఽ కూర్మిమెయిన్ వచియించుమాటలన్
జూడక, నీవెమోక్షమని ఽ సొంపుగ నమ్మి నిజాంగనామణిన్
వీడితి; నీకతాన నవి ఽ వేకుఁడనైతిని; జన్మమేల, నా
చేడియజాడ దీసి యిక ఽ జేరి క్షమింపఁగ వేడకున్నచో.

అవురా! నీవెంతమాయలాడివి. నీమోహసముద్రములో ముంచివేసి వివాహ మాడకుండగావించితివి. ఎట్లో గురుని ప్రేరేపణమున ఖడ్గమునంపి కాంతామతిని వివాహమాడ, నన్నా యువతినిఁ జూడకుండఁ జేసి, చిత్రపటమునకు సున్నమురాసి, యంధురాలని వచించి, యామె నరణ్యముల పాలు గావింపఁజేయించితివి. వగలాడీ! నిన్నని నందువలన బ్రయోజనమేమియున్నది. ధనాంగనల విషయము సంపూర్తిగ నెఱింగియు, నీవ్యామోహములోఁబడి, యభిమానధనంబులు గోలుపోయిన నన్నే

నిందించుకొనవలయును—(ఇంచుక యూరకుండి) కాంతామతి నుద్దేశించి) హా! కాంతామతీ! నీకిట్టి కష్టము గలిగించితినని నన్నెంతగా దూరుచుంటివో, బ్రదికియుంటివో లేదో, బ్రదికియుంటివేని నిన్నుఁగాంచు భాగ్యము నాకు గలుగునా? కానిమ్ము, పరమేశ్వరునిపై భారము వైచి నిన్నరసెదఁగాక, నిన్ను జూచువరకు నీసన్న్యాసివేషమే నాకు దగియుండును. (కొంచెముసడచి)

సీ. భువనమోహినితోడ ఽ పొందు స్వర్గంబంచుఁ
దలపోసి మదిలోన ఽ మెలఁగినాను
మెలఁతతోడను సౌఖ్య ఽ మే నాకు సర్వంబ
టంచు మిగుల ముదం ఽ బందినాను
మొగము జూపినయంత ఽ మురియుచు, కపటంబు
నెఱుఁగక సకలంబు ఽ నిచ్చినాను
యధరంబుఁగదలించి ఽ నంతనెయుబ్బుచు
మహీపాలకంబెల్ల ఽ మఱచినాను.

తే. గీ. గురుఁడుపల్కినమాట గై ఽ కొనక యిట్లు
వెలవెలఁదిపొట్టను ధనంబు ఽ బెట్టినాను
దుదకు ఘోరపాపంబని ఽ మదిఁదలఁపక
యడవులకు నిజకాంతను ఽ నంపినాను,

సీ. వారాంగనలపొందు ఽ పరమసుఖంబని
మదిఁదలంచుచునుండు ఽ మనుజులార
ధనకామినీమోహ ఽ మునఁ గూలివ్యర్థులై
తుదకును జెడిపోవు ఽ తుచ్ఛులార
మందహాసముఁగాంచి ఽ మమతగై కొనిమడి
మాన్యంబులమ్మెదు ఽ మూర్ఖులార
వెలకాంతపైఁ బ్రేమ ఽ వెలఁదినినింటనే
ద్వేషించుచుండెడునవి ఽ వేకులార

తే. గీ. విన్నాఁడు, నావాక్యములు సిగ్గు విడిచి పల్కు-
చుంటి నీకన్నైన సన్న్యాసి సుందరులను
దరికిఁ జేరఁగాఁ నీయక ధన్యులగుఁడు
మహితశుభములొందవుమీరు మాన్యులార,

(నిష్క్రమించును.)

రంగము:—[కాంతామతియున్న మందిరము—వీధియరుగుపై చిత్రసేనుఁడు సన్యాసివేషముతోఁ బ్రవేశించును]:—

చిత్ర—(తనలో) అరణ్యంబునఁ దత్సమీపమునయున్న పల్లెలు పట్టణములు మొదలగునవి యన్నియు నాకాంతామతికై యన్వేషించితిని; గాని యక్కాంత యెందును గనుపింపదయ్యెను. అక్కటా! ఏమి సేయుదును.

ఉ. నేఁటికి రెండునాళ్లు చన నేనుభుజించి; శరీరమందు నా
పాటవ మెల్లఁదప్పె నడు వంగఁగదుర్ శ్రమకల్గె నింక నా
పాటలగంధిఁ గాంచఁదగు భాగ్యము భూతలమందునున్న దా
హాటకచేలుఁడైనను నక్కట బోవ డిఁకేమి సేయుదుర్.

నేఁటికిక్కడ విశ్రమించి యీపురంబునఁ గూడనరసెదఁగాక. (ప్రక్కంజూచి) ఈమందిరమునుండి యనేకులు బ్రాహ్మణులును, స్త్రీలును వచ్చుచుఁ బోవుచున్నారు. దీనికిఁ గారణమేమైయుండునో, (ఆలోచించి) ఈయింటిలో నెవ్వనో గొప్ప వ్రతమేదైనఁ జేయుచునుండనోపు (కూర్చుండును.)

కాంతా—(ప్రవేశించి తనలో) అక్కటా! ఈ దుష్టబుద్ధి చేతికిఁ జిక్కిన నేను నామానము గాపాడుకొనుటకు, నీతనిని వంచింప నాయభిమానములు గడుపుపెట్టి గౌరీవ్రతముసేయ మొదలిడితిని. నాకై యీదుష్టేన్ద్రపాలుఁడు తనధనమంతయు వినియోగ పఱచినాఁడు.

నేను పెట్టిన గడువికను ఆరు రోజులు మాత్రమే యున్నది. ఈగడువులో పుగనే నీవు దేశమునుండి తప్పించుకొని పోవక యుంటివేని, నాకు హానిసంభవించును. హా! పరమేశ్వరా నాయెడల నింత నిర్దయ వహించితివేల ?

అనుబంధము 15

చిత్ర—హా! కాంతామతీ! కఠినచిత్తుఁడనై నిన్ను గానసంబుల బాలుజేసితినని తలంచి, బ్రదుకుపై రోఁతఁబూనియెట్టి హానీయుఁ జేసికొని యుండవుకదా !

తే. గీ. పాపకర్ముఁడఁ గుటిలుఁడఁ బడఁతిమిన్న
గణికమాటలు చెవిఁజేర్చి కానకకట
నిన్నుబంపించి పాపినై నెగడినాను
కలఁడె ననుబోలు నిర్భాగ్యుఁ డిలనుకాంత.

నిన్ను మరలఁ జూచుభాగ్యము నాకున్నదా ?

కాంత—(చిత్రసేనునిఁ జూచి) ఈసన్యాసి యెవ్వరు? ఈతనిముఖముచూడఁగా నానాథునివలెనున్నాఁడు. అదియుంగాక యీతఁడు నానామమును నుచ్చరించుచున్నాఁడు. ఏమోకాని నాచిత్తమునన దియొకవిధమయిన సంతోషము దయించుచున్నది. కానిమ్ము. ఈతనియుదంత మరసెదఁగాక, (ప్రకాశముగా) మహాత్మా! యతివేషము న నున్న మీరెవ్వరు? మీరెందులకో గాని మిగుల పరితాపమును బొందుచున్నట్లు మీ మొగము చెప్పుచున్నది.

చిత్ర—(తనలో) ఈకాంతామణి యెవ్వరు? నాయుదంతముతో నీమె కేమిపని యున్నది. (ప్రకాశముగ) కాంతామణి! నీవెవ్వర వాశుద్ధాంత కాంతవలె నున్నావు. దీనుఁడనగు నాచరిత్రముతో నేమి

కాంతా—మహాత్మా! వినఁగూడదా ?

చిత్రి—అభ్యంతర మేమియు లేదు; గాని, నాచరిత్రము వినెడి వారికిఁగూడఁజింత కలుగును. అంతియేసందియము.

తే. క్షత్రియాన్వయమందున ॥ జన్మమంది
ధరణిఁ బాలించువాఁడనై ॥ తనరుచుండి
కాలచక్రము ద్రిప్ప నీ ॥ లీల మారి
నాఁడ; నింకేమి తెలుపుదు ॥ నాచరిత్రి.

కాంతా—(తనలో) ఈతఁడొక రాజఁట! కాలవశమున నిట్లు మారినాఁడట! ఈతఁడు నానాథుఁడై యుండునని సంశయము కలుగుచున్నది. (ప్రకాశముగా) అందుకుఁ గారణము నే నెఱుంగవచ్చునా మహాత్మా!

చిత్రి—అనేక దుష్కృత్యము లొనర్చి మహాపాపముగట్టుకొన్న నేను నాకుఁ గలిగిన యీ ప్రస్తుత స్థితికిఁ గారణము మాత్రము చెప్పుట కేల సిగ్గువడవలయును! వినుము.

సీ. భువనమోహినినాఁగ ॥ బొలుపొందు వేశ్యతో
స్నేహంబుగావించి ॥ చెలఁగినాఁడ

కాంతా—అక్కటా! రాజులైయుండి, సమస్త ధర్మములును దెలిసిన మీరే వేశ్యావ్యామోహమునఁ బడితిరా?

చిత్రి— వనితకటాక్షమే ॥ స్వర్గంబుటంచును,
నెంచి సర్వముదాని ॥ కిచ్చినాఁడ

కాంతా—మోహమువెంట నిట్టి కార్యముండి తీరునుకదా!

చిత్రి—కోమలాంగినె నాకుఁ ॥ గులదైవతంబని
పరిణయేచ్ఛనుసుది ॥ వదలినాఁడ

కాంతా—దాని మాయవలలో మీరు సంపూర్తిగఁ జిక్కుకొంటిరి. (తనలో) ఇదియంతయు నానాథునిచరిత్రమువలెనే యున్నది.

చిత్ర—అట్లుండి గురునివా క్యంబుల నాలించి
యతివనొక్కతె పెండ్లి యాడినాఁడ

కాంత—మీరు వివాహమాడిన కాంతపే రెవ్వరు ?

చిత్ర—కాంతామతి—

కాంత—ఇప్పుడాపొలఁతి మీదగ్గఱనే యున్నదా!

చిత్ర—వెలకాంతమాటపై పరిణయంబైనట్టి
పడతిని గానకుఁ బంపినాఁడ.

కాంత—అయ్యయ్యో! అగ్నిసాక్షిగ గైకొన్న యాకాంతను వారాంగనమాట నాలించి యరణ్యములకుఁ బంపితిరా! ఎట్టి ఘోరకృత్యము సల్పితిరి! (ఇంచుక యూరకుండి) ఇప్పుడు మీరెచ్చటకుఁ బోవుచుండిరి—

చిత్ర—

తే॥ గీ॥ వారకాంత చేసిన పనుల్ బయలుపడగ
వనితపై రోసి రాజ్యపా లనమువిడచి
భూరివైరాగ్యభావంబు బొంది నాదు
పత్ని వరయుచు నీరీతి వచ్చినాఁడ.

కాంత—ఈతఁడు మన్నాథుఁడు. నేఁడెంతయు సుదినము (ప్రకాశముగా) ప్రాణేశ్వరా ? మీరువచించిన కాంతామతిని నేనే.

చిత్ర—(ఆనందముతో) ఏమీ! నీవు కాంతామతివా! హా సౌందర్యరాసీ! నేను నీయెడల నెట్టి పాపకార్యం బొనర్చితిని! సతీమణీ! నీవిక్కడకెట్లు చేరుకొంటివి.

కాంత—నాథా! మీచేఁ బరిత్యజింపఁబడి యరణ్యమునఁ జరించుచుండ ధనపాలుఁడను నొకవైశ్యుఁడు తన గృహమునకుఁ దోడ్కొనిపోయినాఁడు. అతఁడు నన్నుజూచి కామాంధుఁడై, తుదకు నాచే నీతి నుపదేశింపఁబడి సన్మార్గవర్తియైనాఁడు. అటుతరువాత.

యీపురాధీశుఁడగు దుష్టబుద్ధి నన్ను బట్టించి, తనమందిరమునకుఁ జేర్పించి, నామానభంగము సేయఁదలఁపఁ దద్రక్షణార్థమై గౌరీవ్రతమను నెపమొకటి కల్పించి యీయుపవాసములు గడువడిగితిని. ఇంక నా ఆరుదినములు గడుపుమాత్రమే యున్నది. పరమేశ్వరుఁడు నన్నేమిచేయునోయని విచారించుచుండ, మత్పూర్వకృతసుకృతంబున నిన్నుఁ జూచితిని.

చిత్రి—

సీ. వారాంగనాస్నేహ । బద్ధుఁడై దానితో
సంతతమున్నట్టి । జారుఁడనక
ధనవధూటినినమ్మి । ధనముసర్వంబు దా
నికి సమర్పించిన । నీచుఁడనక
వెలయాలిపై భ్రాంతి । విఱ్ఱవీగుచు గౌర
వము నేలఁగల్పిన । పాపుఁడనక
కులఁటబోధనపైనఁ । గులకాంతవారీతి
గానకంపినయట్టి । కష్టుఁడనక.
తే॥ గీ॥ ప్రజలచేతను ఛీవాట్లు । బడుచు బ
నట్టి; దుర్మతి, కుటిలుఁడీ । వ్యర్థుఁడనక
మించుసత్కృప నన్నాద । రించఁదగును
భామ! సరసశృంగార లా । వణ్యసీమ.

కాంతా—నాథా! ఇప్పుడు మనమియ్యెడ మాటాడుచు దడవుసేయరాదు. ఎవ్వరైనను జూడఁగలరు, కావున నెట్లో యోపికబట్టి యర్ధరాత్రివరకును నీతిన్నెపైఁ బండియుండి యనంతరమటు లేచి యుండుఁడు. నిశియందు నేను తలుపుఁదీసికొని వచ్చెద. ఒరులకంటబడకుండ నావలకుఁ బోవుదము—

చిత్రి—మంచిది—

కాంతా—(నిష్క్రమించును)—
చిత్రి—(నిద్రించును)—

[దొంగ—ప్రవేశించును].

దొంగ—(తనలో) యీడకెల్లినా నాల్గురోజులనుంచి సరీంగా కన్నవే పారకుండావుండాది సుక్కేదు రవుతుండాది. కారణవేంటో తెలకుంది. యేంకారణం. గస్తీ జవాన్లు మహాతిరుగుతుండారు. తిరిగితే మాత్రిం యేంపోతాది. మొరిక్రెటుఖాలునన్ను పట్టేదుత్తారా. అంతగా పట్టే నాకొచ్చిందాంట్లో కూంత యేదాన్నెట్టే నోరుమూసుక సక్కాపోతారు. అయినా బెమ్మదేముడైనా నన్నెట్టుకోలేడు. నేనేం సామాన్యపోడినా- గజదొంగని- పెల్లిల్లయ్యే కొంపలదగ్గిఅ నేను పెత్తతుం- ఎవల్లయినా సస్తే శవాన్ని రాత్రిప్పుడా వాకట్లో పెట్టుకొని యేడుత్తావుంటే దొడ్డిదోవను కొంపలోసొచ్చి సవరంచెయ్యడానికి మొనగోడిని. జేబుదొంగతనములోను, తీర్థాల్లో కత్తిరెయ్యడానికి నన్నుసెప్పి మరోడిని సెప్పాలి. (ఇంచుకనడచి) పురమంతా నిచ్చబ్దంగావుంది. ఇహ యేపారం సూసుకోవాలి. ఈయూలతోలితా మహాలచ్చమ్మతల్లిని, తిక్కనమ్మోర్లుని మొక్కుకుంటేనేగాని యేపని సెయ్యకూడదు.

అనుబంధము—17.

(ఇంచుకనడిచి) ఈమేడసూస్తే మనపనికి సులువుగా వున్నట్లుంది, ఇందులోయెవరో గొప్పోరేవుండారు. సాలారోజులనుండి యీయింట్లో జేవనోల్లు జుట్టున్నాల్లు ఆడోల్లు వప్పన్నులు తింటున్నారు. (ముందుకు నడిచి) ఈయరుగుమీాద యీడెవడోపడిసిద్రపోతుండాడు. యీాడిదగ్గిఅ యేవయినా సుట్టముక్కకు దొరుకుతాదేమో, (నిద్రించుచున్న చిత్రిసేనుని దగ్గిఅకు బోయి) ఈడెవడో సన్నాసిముండాకొడుకు. ఈడిదగ్గి రేవుంటాదిబూడిదే; (అచ్చటినుంచిపోయి) ఈయింట్లో కెల్లితా

నికి యీతలుపుకి గడియ కన్నవెట్టా. (కన్నము చేసి,లోపలగడియ తీయఁబోవ తేలుకుట్టఁగా) ఓయ్‌బాబో, సచ్చానురా, నల్లతేలోడిసింది. ఓరబ్బో. వొళ్లుమంటలెక్కుతుంది, కన్నానికొచ్చేటప్పు డానన్నాసి మొదవమొగం సూశాను—

అనుబంధము—18.

(ఇంచుకనడిచి) ఇక్కడ నిచ్చెనుందేంటి.

కాంతా—(చూచి) నానాథుఁడువచ్చియున్నాఁడు. నేను నెమ్మదిగా నిచ్చెనమీఁదనుంచి దిగెదనుగాక—

దొంగ—(చూచి తనలో) ఇదేంది. సిత్రిం. యెవరో దిగివత్తుండారు.

కాంతా—(దిగివచ్చి) ప్రాణేశా. మాటలాడకుండ నావలకుఁ బోవుదము.

దొంగ—(తనలో) ప్రాణేశా అంది, సరే! సంగతి తెలిసింది. ఇది మనకి దక్కింది.

కాంతా—నాథా! పద! ఎవరైనచూచిన మోసము.

(ఇరువురును నిష్క్రమింతురు)

రంగము:—[అడవి, కాంతామతియు, దొంగయు ప్రవేశింతురు].

కాంతా—(తనలో) అక్కటా! నేనెంతమోసపోయితిని. వీనిచే వంచింపఁబడితినికదా!

తే॥ గీ॥ నాథుకనులారఁ గాంచితి నాదుకష్ట
సమితి నశియించెనంచును సంతసంబు
మదినిబొంచుచునుండగా మరల నిట్లు
కటకటా మోసపోతిఁ దస్కరునివలన.

నిన్న నాప్రాణేశ్వరునితోఁ జెప్పినమాట ననుసరించి, యర్థనిశియందు గనఁబడిన యీతఁడే నాథుఁడని భ్రమించి వచ్చితిని. హా! పరమేశ్వరా!

తే॥ గీ॥ అడవులందున బెడిదంపు కటికములందఁ
జేసి; దుష్టమతులచేతఁ జిక్కఁజేసి
యిడుమలను జాసితంచును నెంచిముదము
మదినిబొందఁ బతినిఁ జూపి మరల దొంగ
కు నిటుఁజిక్కించి నాకొంపఁ గూల్చినావు.

నీచేష్ట లద్భుతములు. ఏన్నేమనఁ గలను?

అనుబంధము—19

దొంగ—(తనలో) ఈపిల్లది నన్ను సూచి, నాయందసందాలు సూచి వలిసొచ్చిందికామోసు. నేను దీనిబుద్ధికి నచ్చానుకావోసు.

కాంతా—(తనలో) వీనివికృతవేషము నాకుమిగుల భయము గొలుపుచున్నది. వీడు నాయెడల నెట్టి ద్రోహబుద్ధిదలఁచి తోడ్కొని వచ్చినాఁడో. చెప్పినప్రకారము నేను చేయలేకపోతినని నాథుఁడు విచారించుచు, నేనింకను దుష్టబుద్ధి నన్నుంచినమందిరమునందే యుం టినని నాకై పరీక్షించుచు నాపురమునందే చరించుచుండునుకదా.

అనుబంధము—20.

దొంగ—(తనలో) రేతిరికన్నవడి చొమ్ము దొరక్కపోతె పో యెగాని సక్కనిపిల్ల దొరికింది. ఇదంతా మాలచ్చువమ్మోరుదయ. ఈసిన్నదాన్ని సూస్తుంటే వళ్లు పుల్లయిపోతావుంది ఎట్టాగయినా దీని ని పెళ్లాడుతా. ఇంతసక్కనిసుక్కని పెళ్లాడానంటే నాసుట్టాలకి యె త్తరతుంది. (రెప్పలు వాల్చకుండా చూచును)

కాంతా—(తనలో) వీనిచూపు చూచిన నాకెంతయు భయ ము కలుగుచున్నది. వీఁడు నన్నేమిచేయునోకదా—ఇప్పుడు నేను వీని

వారినుండి తప్పించుకొని యావలఁబడుట యెట్లు, కానిమ్ము. వీఁడెవ్వడో యడిగెదఁగాక—(పరికాశముగా) ఓయీ! నీవెవ్వఁడవు?

దొంగ—(మాట్లాడకయుండును).

కాంతా—(తనలో) ఏమిది! నామాటకుఁ బ్రత్యుత్తరమీయకున్నవాఁడు. మూగివాఁడా యేమి? (పరికాశముగా) మాటాడవేమి?

దొంగ—(ఊరకొనును).

కాంతా—(తనలో) వీఁడేమియుఁ బలుకకున్నాఁడు. నేను నెమ్మదిగా యావలకు దాటుదునా? కానిమ్ము. పరమేశ్వరుఁడున్నాఁడు. (ఆవలకుబోవుచున్నది)

అనుబంధము—21.

దొంగ—ఇంతకష్టపడి, తాడేస్కొనిదిగి ప్యాడేశా అని నన్ను బిలుసుకొనినచ్చి నన్నిడిసి యేడకెల్తావు.

కాంతా—నీవెవ్వఁడవు?

దొంగ—తెల్బా. యేసంజూసి కనుక్కో. మరిగంటే. సూస్తాను నీబుద్ధి.

కాంతా—వేషమునకేమి బాగుగనేయున్నది. కాని, యింతకును నీవెవ్వఁడవో చెప్పవేల.

దొంగ—నేనా! మంచి మొనగోణ్ణి.

కాంతా—దేనికి?

దొంగ—ఇందుకే. అంటే నీకు తెలవలే. నడీనవ్వుడుగాకుండా ప్యాడేశా అని నీచేత పిలిపించుకొని ఆవళంగా నక్కొచ్చాను.

కాంతా—ఓహో! నీవు దొంగతనములో గట్టివాడవా?

దొంగ—అద్దది. దొంగోణ్ణి. నీకట్లోసిందులాటగాణ్ణి

కాంతా—నీవునన్నేల యిట్లువంచించి తెచ్చితివి?

దొంగ:—నీవేగా నాయెంటపడొచ్చావు.

కాంతా—అట్లయిన నీకు నీదారిని నీవుపొమ్ము. నాదారిని నేపోయెదను. (నడచుచున్నది)

దొంగ—ఇద్గో-ఇద్గో- నన్నిడిసి యేడకెల్లడం? సూడు. మరి గంటె నన్ను పెళ్లాడవ్వా!

కాంతా.—ఓహో! నిన్ను నేను పెండ్లియాడవలయునా? నీవేషమునకు, నీరూపమునకు బెండ్లియొకటి తక్కువ యైనదికాఁబోలు

దొంగ—నేను నీకు నచ్చలే! సూడు నన్నుఁ పెళ్లాడ్తావంటే నీకు తక్కువలేదు:-

(అనుబంధము 22)

సూడుపిల్లా! నామాటయినుకో. నేనునల్లోణ్ణిఅని నీకు చండేహా వాయేంటి; కుట్టమూర్తి నల్లోడుకాదూ చీరాముడు నల్లోడుకాదూ

(అనుబంధము 23

కాంతా—(తనలో) వీనిని నెట్లయినను వంచించి నేనావలకు దాటవలయును. వీనికీఁదగినట్లు నేను మాటాడకయుంటి నేని దుర్మార్గుడేకార్యమునైనఁ జేయఁగలఁడు (పరిహాసముగా) నిశ్చయముగా నీవు నన్ను బెండ్లియాడఁదలఁచితివా?

దొంగ—అమ్మతోడు- సత్తెంచెప్పుతున్నాను నిన్ను పెళ్లియిందాకా నాకడుపులోవున్న ఉకారంపోదు-

కాంతా—వివాహమునకేమిగాని, నిన్ను జూచిన నాకు మిగుల నసహ్యము కలుగుచున్నది. ఇటువంటిమలినపువస్త్రములతోఁ బెండ్లియేమిటి! పెండ్లికి బంధువులుండవలదా? మేళతాళము లుండవలదా?

దొంగ—నువ్వు నన్ను పెళ్లాడ్తానంటే యేంసెప్పే అది సేస్తాను నీపాదాలసాచ్చి-

కాంతా—అట్లయిన నీవు మంచిబట్టలు అనగా క్రొత్తబట్టలు కట్టుకొని, నీబంధువులతో రావలెను. వచ్చేటప్పుడు మేళతాళము లుండవలెను సుమా !

దొంగ—అబ్బో ! సాలా పెట్టావే ! అయినా అమ్మోరితల్లి దయుంటే ఇయన్నియెంత! వూళ్లో మారాజులు బాగుంటే నాకు కొత్తగుడ్డలకేమి తక్వ; సుట్టాలకేం- నాకుసాలామందున్నారు. మాబావ బల్లిగాడు, మామావ సిన్నిగాడు, మాపెద్దమ్మ-అత్తమ్మ, వొంకమ్మొదిన- యీళ్లందరిని కొట్టుకొత్తాను కాని వొక్కటిమాత్రం కూంత చందేహంగావుంది. బజంత్రీగాళ్లొత్తారాలేదా అని ఆలోశన.పోనీ అదీ లేకపోతేనేం.

కాంతా—పెళ్లికి మంగళవాయిద్యము లుండవలయునుకదా అదిలేకపోయినచో పెండ్లియే కాదు.

దొంగ—పెళ్లి కాకపోతె యెట్టా--తీస్కొస్తాగా ! నువ్వు మాయింటికొస్తే సక్కంగావుంటుందిగా-

కాంతా—అట్లుగాదు. మనమిక్కడ వివాహము చేసికొనిన పిదప, నీవు నన్ను మీయింటికి తీసికొని వెళ్లవచ్చును-ఇక ఆలస్యముచేయక పోయిరమ్ము.

దొంగ—ముత్తంమీద యెళ్లవలసినదేనన్నావు.

కాంతా—ఇంకను సందియ మెందుకు?

దొంగ—యెల్తానుగాని నువ్వేడుంటావు ?

కాంతా—ఆచెట్టుక్రిందనే యుందును. నీవుమాత్రము త్వరగా రావలయును సుమా !

దొంగ—యిక్కడుమ్మేసి—అదిఆరకుండా వరుగెత్తుకొనిరానూ

కాంతా—మాటలతో నాలస్యము సేయకపోయిరమ్ము.

దొంగ—యెల్తాగాని నువ్వెళ్లిపోతావేమో !

కాంతా—నేనట్ల వెళ్లుదాననుకాను నమ్ముము.

దొంగ—సత్తెంగా-యెల్తావేమో.

కాంతా—నన్ను నమ్మవా! నమ్మకున్న, బోనిమ్ము! వివాహా మే జరుగదు.

దొంగ—ఓరబ్బో! అది లేకపోతే యెట్టా? నాయెంటబడొచ్చిం దాన్ని నిన్నదిలేసుకొంటానా. యెట్టోణ్ణాయేంటి. సరే యెల్తాగాని-నీ పేరు కసింత సెప్పు.

కాంతా—నాపేరు కాంతామతి.

దొంగ—ఇదెక్కడిపేరు. సిలవలుపలవలుండాయ్. మావోళ్ల పేరులుసూడు- యెంకి-మల్లి-పుల్లి-నీపేరు నోటికిరాదే- యేంటి సెప్పి నావు మళ్లిసెప్పు.

కాంతా—కాంతామతి.

దొంగ—కాంత—ఇకసాలులే- ఆపైదొద్దు- కాంత-కాంత-

కాంతా—అట్లనేపిలువుము- పోయిరమ్ము.

దొంగ—ఇదిగో యెల్తుండా (ఇంచుకనడచి- మరలవెనుకకుం దిరిగివచ్చి) యెల్లిపోతావేమోసుమా- నిన్ను సంపుకు తిన్నట్టే- తొం దరగా పాటొత్తాను. తెల్సిందా- యెల్లొద్దు- ఏవంటావు- యెల్తుండా.

కాంతా—ఊం పోయిరమ్ము.

దొంగ—ఇదిగోపోతుండా! (ఇంచుకపోయి) నువ్వొల్లమాక! యేం- (తిరిగివచ్చి) పెల్లిసేసుకొంటానని బజానా యిత్తావూ!

కాంతా—వివాహమునకుఁగూడ మీయందిదియొక యాచార మా యేమి!

దొంగ—ముందు అల్లు-యీల్లు- తాంబూలాలుచ్చుకోరూ.

కాంతా—ఇప్పుడవి యన్నియు నిక్కడ యెట్లుదొరకును?

దొంగ—పోనీ! బజానాకిందొక్కముద్దిచ్చుకో-

(దగ్గఱకు రాబోవును)

కాంతా—ఇప్పుడేమియు కాదు. నీవు త్వరగా పోయి రాకపోయినచో వివాహలగ్నము మించిపోవును.

దొంగ—అయ్యో- ఎల్తుండా- నువ్విక్కడేవుండు. పరుగులో వత్తాను- (వెనుకకుంజూచుచు- నిష్క్రమించును)

కాంత—(తనలో) ఈదుష్కర్ముని నెట్లో మాయచేసి పంపితిని. నేనికనాలసింపక వీఁడుమరలరాకమునుపే, మఱియొక మార్గమునంజని యెద్దఁగాక.

(నిష్క్రమించును)

(అదేప్రదేశము- దొంగ- బంధువులతోడను మేళతాళలముల తోడను- ప్రవేశము)

దొంగ—(బంధువులంజూచి)

అనుబంధము 24

ఓరీ! మామాం! ఓలత్తా-రండి పెళ్లికూతుర్ని సూస్తే మీరు ఖంగారడ్తారు. ఏవిచక్కంది. సుక్కల్లోశందుర్డే.

1 ఏదిరా పెళ్లికూతురు?

2 ఓరన్నా! యేదిరావొదినె.

3 ఏదిరా మరదలుపిల్ల.

దొంగ—వుండండేస్ గోలసేస్తారు. మీగోలయిందంటే పిల్ల బెదిరిపోతాది. ఆసెట్టుసాటున వుండాదిగాని నెపాదిగారండి-

(అందరును చెట్టుదగ్గఱకు వెళ్లుదురు.)

1 ఏదిరా సెట్టుకింద.

2 ఈడిమాటలన్నీ అబద్ధమేరా.

3 దొంగముండాకొడుకబద్దాలుసెప్పి యిందరిని తర్లించుకొచ్చాడు. యెంతకష్టపెట్టావురా-ఛీ-

1 వెధవని తన్నండి- (నలుగురు నాలుగుదెబ్బలుకొట్టి నిష్క్రమింతురు)

దొంగ—శాంతా! శాంతా! నీతల్లిసిగకొయ్య! కొంపతీశావు. సుట్టాల్ని తెమ్మని— మంచిబట్ట తేసుకరమ్మని, నన్నిట్టాసేశావు. నీసూలాలాన్న సుట్టాలసేత దెబ్బలుకూడా తిన్నాను. ఏడకెళ్తావులే. ఈ యడవిలో నిన్ను పట్టుకొని పెళ్లిసేసుకోకపోతానా.

(నిష్క్రమించును)

ఇది చతుర్థాంకము.





# కాంతామతి.

—:పంచమాంకము:—

రంగము:—(దుష్టబుద్ధి కాంతమతినుంచినమందిరము సమీపమున-చిత్రసేనుఁడు-ప్రవేశము)

చిత్ర—అక్కటా! ఇది మిగులనాశ్చర్యముగ నున్నదే. నాసతీమణి యర్ధరాత్రి నన్ను వచ్చి యావైపున మేడక్రింద వేచియుండవలసినదని చెప్పినది. మార్గాయాసమున డస్సియుండుటచే నాకు సరియైన కాలమునకు మెలకువరాకపోవుటచే నొక్కింతయాలస్యముగ నచ్చటకు వెళ్లి చూచితిని. కాని ప్రయోజనము లేకపోయెను. తెల్లవారుఝామువఱకుఁ గనిపెట్టియుంటిని. చెప్పినప్రకార మామె రాకపోవుటకుఁ గారణమేమైయుండును. ఆ కాంత కెట్టిమోసము సంభవించెనోయని నామనంబున మిగులఁ ననుమానమువొడముచున్నది. నాకొఱకై తాను నెమ్మదిగా వచ్చు సమయమున నెవ్వరయిన మేల్కొనియుండుటచే రాలేకపోయెనా? లేక దుష్టబుద్ధి యేదయిన నాటంకముగల్పించెనా! నాకేమియుఁ దోచకయున్నది- (ఇంచుకనడిచి) ఈప్రదేశమునకే వచ్చి నన్ను వేచియుండుమని యాసతి చెప్పినది. (పరీక్షించి) తెల్లవారింపిదప నిక్కడ కెవ్వరును రాలేదుకదా-ఇదిగో! ఇక్కడ నాడుదాని యడుగుల జాడ

గనిపించుచున్నది—అదియేమి కాదు! ఈకనిపించునడుగులు పురుషునివలె నున్నవి. వీనింబట్టిచూడ నెవ్వఁడో యొకఁడు కాంతామతిని వంచించికొనిపోయియుండెనని స్పష్టముగఁ దెలియుచున్నది. హా! తపస్వినీ! కాంతామతీ! తొలుత నిన్ను వేశ్యాంగన పలుకులవిని యనాదరించి వనంబులకంపి కఠినకర్ముఁడనై, చేసినపాపమునకుఁ బశ్చాత్తాపమునంది నిన్నన్వేషించుచు నెట్టకేలకు నిన్నిక్కడఁగాంచి నీతోఁగూడ నీమందిరము వెలువడి సౌఖ్యమనుభవింతునుకదా. యని సంతోషించితిని. అయ్యో! నాసంతోషమింతలోనే భగ్నమయ్యెనుగదా! ఇఁకనీజాడ నాకెట్లు తెలియును. (తెరలోకలకలమువిని) ఏమిది- యెవ్వరో పరుగెత్తుచున్నారు—

(తెరలో)

గారీవ్రితముచేసి రాజుగారి కొంపముంచివెళ్లిన యామె మరల గనిపించునా?

చిత్రి—(విని) ఆపరుగెత్తునది నాసతీమణినివంచించి తెచ్చిన దుష్టబుద్ధిసేవకుఁడు- వీనితోందరయు నూటలును చూడగా పేర్చియసి యాభవనమునుండి తప్పించుకొని పోయినట్లు తెలియుచున్నది. కాని, యెవ్వఁడోమరలమోసముజేసి కొనిపోయియుండును—హా! పరమేశ్వరా!

తే॥ గీ॥ పడఁతినట్లరణ్యములకుఁ । బంపినందు
కాత్మఁగుందుచు నెట్టిటో । యామెవరసి
ముదమునందంగమరలన । మ్ముదితనకట
నాకునీభంగి నెడబాపి । నావదేవ.

ఇక్కడ నేనుచింతించుచుఁ గాలయాపనము జేసినందువలనఁ బ్రయోజనములేదు- శీఘ్రముగఁ గాంతాన్వేషణోద్యోగమున వర్తించెద గాక—

(నిష్క్రమించును)

రంగము:—[అరణ్యము:—ప్రవేశము:—విచారముతో కాంతామతి]

కాంతా—హా! ప్రాణేశ్వరా! నీతోఁజెప్పినప్రకారము చేయనైతినని నీవెట్లు విచారించుచుంటివోకదా! అర్ధనిశీథియందు నిన్నుండుమని నప్రదేశమున దస్కరుఁడునిలచియుండగా, నివనితలంచివచ్చి వానిచే వంచింపఁబడితిని. ఎట్లో మాయచే వాని బారినుండితప్పించుకొని యీవలబడితిని. నన్ను గుఱించి నీవెంత కష్టమందుచుంటివోకదా!

తే॥ గీ॥ కరుణమదిలోనఁబూనిన కన్నరయఁదలఁచి
వచ్చి, ననుజూచినాఁడవు భవ్యముదము
బొందినాను నీతోఁగూడి యుందుననుచుఁ
దలఁచితినిగానియిటులొటఁ దలఁపనైతి.

నన్నన్వేషించుచు నీవెందెందు జరించుచుంటివోకదా! నిన్ను నేను మరల నెచ్చటగాంచఁగలుగుదును? కంటకావృతమైన నేలపై నడచుటం జేసి పాదములెఱ్ఱవారి, యిఁక నొకయడుగైననుగదలనీయకున్నవి. ఆవటవిటపిక్రింద నొకింతకాలము కూర్చుందునుగాక—(కొంచెము నడచియొక చెట్టుక్రిందఁగూర్చుండును)

(ఇరువురు రాజకుమారులు—ప్రవేశింతురు)

మొ—మిత్రమా!

తే॥ గీ॥ కంటివా మహారణ్యమే కరణినున్న
దో! మనసుదీర మనము సం తోషమునను
వేటలాడంగవచ్చును భీకరమృగ
బృందమెచట జూచిన నందు వెలయుకతన—

రెం—ఇయ్యడవియందనేక క్రూరమృగములున్నవి. వేటయందు నేర్పఱితనము మనము నేడు సంపూర్తిగఁ బ్రకటించుటకవకాశ

మొదవుటయేగాక! మార్గస్థులకు హానిగూర్చుచున్న ఘోరమృగంబుల సంహారింపవచ్చును.

మొద—(చెట్టుక్రిందనాసీనయైయున్న కాంతామతిని జూచి) మిత్రమా! అదియేమి! ఈవటవిటపిక్రింద నొక యువతీరత్నము కూర్చుని యున్నది.

రెండ—(పరికించి) భళిరా! ఆమెసౌందర్యము త్రిజగన్మోహనమైయున్నది—ఈమెయీయరణ్యమునకు వచ్చుటకేమి కారణమో! వెంట నెవ్వరును లేక యుందురా?

మొద—అయినను మనమాకాంతను సమీపించి యుదంతమరగ యుదముగాక—(తనలో) ఔరా! ఈయలివేణి సౌదర్యము నాహృదయము నాకర్షించివేసినవి. ఇట్టిసౌందర్యవతినెందును దిలకించియుండలేదు.

చం॥ ఇలగలసుందరాంగులను । నెందఱనోతిలకించియుంటినీ
యలికులవేణిబోలుచెలియల్ । గనుగొన్నది లేదు! దీనిని
న్వ్యొడఁబరికింపనామదనుఁ । డేయగసాగెనుబుష్పబాణముల్
గలికిని నేవిధంబునను గాఁగిఁటజేర్పఁ । గలాడనోకదా.

రెండ—(తనలో) ఇక్కాంత శౌర్య మద్వితీయమయిన దని చెప్పవచ్చును.

తే. గీ. పరము నిష్ఠా గరిష్ఠులై । వనములందు
దపములొనరించు చుండెడు । ధన్యులైన
కాంతసౌందర్య మీక్షించి । నంత ముందు
వెనుక లరయక దాసులై । వెంటఁ బడరె.

అట్టియెడ సామాన్య మానవుడనగుఁ నన్నుగూర్చి చెప్పనేల? ఈకాంతారత్నమును వీక్షించినంతనే మదనుఁడదయుఁడై తనపదను శరంబుల నాయెద నాటించుచున్నాఁడు. నేనెట్లయిన నిక్కాంతంగూడు ను

పాయ మరయపలయును-(ప్రకాశముగా) హితుఁడా! ఈ కాంతామణి సంగతి నొక్కింత యరసెదఁగాక-

మొద—నేనును నదియే చూచుచున్నాను. (సమీపించి) కాంతా! నీవెవ్వరవు? ఒంటిగా నీయరణ్యభూమి కేల వచ్చితివి?

కాంత—అన్నలారా! నా దీనదశంగూర్చి యేమని పలుకుదును? విధివశంబున నానాథుని నెడఁబాసి తదన్వేషణార్థమై యిట్లువచ్చితిని. మీరీ యరణ్యమున నాతని నెందైనఁ గంటిరా?

రెండ—ఏమీ! నీనాథుఁడు నిన్ను విడిచి చనెనా? ఆతని పేరు ఎఱుంగఁదగుదుమా?

కాంత—చిత్రసేనకుమారవల్లభుఁడు.

మొద- సరిసరి, ఆతఁడా నీనాథుఁడు, వేశ్యావ్యామోహమునఁ జిక్కి నిన్ను వనమూల పాలుజేసెను గాదా!

రెండ—

తే. గీ. భువనమోహినివాచును ¶ బొత్తుసంగు
నీయెడల క్రౌర్యమును బూని ¶ యిట్టులకట
కాననంబుల కంపిన ¶ కలుషచరితు
నాథుఁడనుచుఁ బలుకనగు ¶ నా! వధూటి.

మొద—అతని కొఱకా నీవరణ్యమున నిట్లొంటరిగాఁ జరించుచుంటివి.

కాంతా—అన్నలారా! పురాకృతప్రారబ్ధమున కెవ్వరు కర్తలు. నానాథుని మీరు దూషింపవలదు. పతియెట్టివాఁడైనను, సతి కాతఁడే దైవము. మీరాతని జాడనేమైన నెఱింగి యుంటిరేని కృపఁబూని వచింపుఁడు; లేదేని నాదారినిఁ బోయెదను.

మొ—సీ. సరసిజంబులఁబోలు । చరణంబులీరీతి
గఱకురానేలపైఁ । గందనేల
రెండ—అంతఃపురంబందు । నలరారునీవుభీ
కరవనంబులయందు । దిరుగనేల
మొ—పట్టుదుకూలముల్ । గట్టుచుండెడినీవు
కడుజీర్ణచేలముల్ । గట్టనేల
రెం—అతులసౌఖ్యంబుల । ననుభవించెడినీవు
భోజనంబును మాని । పొగలనేల

కాంతా—తే. గీ. ఆత్మనాథుని జాడల । నరయఁగోరి
యిట్లు వచ్చిననాకుఁ బ । నేమికలదు
వీనిఁగోడ నరయుఁగాక । విశ్వమందు
ధాతవ్రాతను నెవ్వరైనఁ । దాటఁగలరె?

మొ—అనవసరకష్టములకుఁ బాలై శరీరమును మిగులఁ గృశింపఁజేయుచుంటివి. ఈయవస్థఁ బొందనేల? నావెంటఁ బురంబునకు రమ్ము. సౌఖ్యంబున నుండుము. సందియ మొందవలదు.

రెండ—(తనలో) వీనికీమెయందు గోర్కె జనించెను కాఁబోలు! (ప్రకాశముగా) సుందరీమణీ! నేను నీయొద్ద దాచినందువలనఁ బ్రయోజనమేమియున్నది? నిన్ను జూచినంతనే పంచబాణుఁడు నన్ను బాధింపఁ దొడఁగినాఁడు. నీవు నావెంట మత్పురంబునకు రమ్ము.

సీ. భీకరారణ్యాసం । చారముల్ విడనాడి
ప్రాసాదములయందు । వరలఁ గలవు
కందమూలములు మాని । కడుపార భుజియింప
భక్ష్యభోజ్యంబుల । బడయఁ గలవు
వనమృగంబుల చెల్మి । బాసిదాసీజనుల్
నిరతంబు సేవింప । వరలఁ గలవు

జీర్ణచేలము వీడి స్వర్ణచేలముఁ దాల్చి
వెలఁదు లెల్లరు మెచ్చ కులుకఁగలవు

తే. గీ. ఎట్టి వస్తువు గోర్కొన్న నింతలోనఁ
బడసి, దానిని ధరియించి బరగఁగలవు
మదిని నిపుడున్న దుఃఖంబు మానిసంత
తము బ్రిమోదాబ్ధిఁనోలాడి తసరఁ గలవు.

మొధ—(రెండవ వానింజూచి) మిత్రమా! నీవీకాంతపై యభిలాషవిడువుము-తొలుత నీమెను గాంచినతినే నాహృదయమీమెపైఁ జిక్కినది. (కాంతామతిని, జూచి) రమణీ!

మ, సరసీజానన తెల్పుచుంటి వినుమా సందేహమేలా; రమా
తరుణీ నందనుఁడేనునిన్గనినయం తఁ బుష్ప బాణంబులన్
బరువన్ సాఁచెను వానిబాధకిఁక నై పంజాల గానన్ మదిన్
గరుణింబూనుచు నాకు నీయధరపా నంబిచ్చి రక్షింపుమా.

కాంతా—హరిహరీ! అన్నలారా! ఎట్టి దారుణ వాక్యములు పలికితిరి. (తనలో) అక్కటా! దుష్టబుద్ధిని దప్పించుకొని వచ్చి దొంగకుఁ జిక్కి యెట్లో వానిని మాయఁ జేసి మళ్ళించుకొంటిని కదా యని తలఁచి నాథుని నన్వేషించ వచ్చునని ముదంబందుచుండ, నీదుర్మార్గుల కిప్పుడు జిక్కితినే, పరమేశ్వరా! నన్నిన్ని విధముల బాధించు చుంటివి.

మొద—రమణీ! ఏదియో దీర్ఘాలోచము చేయుచుంటివే. ఈ యిర్వురిలో నెవ్వరిని గైకొందుననియా! అన్ని విధముల నేను తకుఁ దగియున్నవాఁడ. నన్ను వరించితివేని నీవందు సౌఖ్యములకు మేర లేక యుండును.

రెండ—నారీమణీ! నీవు బాగుగ నాలోచించుము. మాయిరు పురిలో సుందరుఁడెవ్వఁడో చూడుము. వీని మాటలలో నేమి లెమ్ము. నన్ను గ్రహించితివేని, నీవే రాణి వయ్యెదవు. ఇంతవఱకును, నేను వివాహమాడ లేదు. నాకుఁ దగిన సుదతీరత్న మెందు లభించునాయని వేచి యుండ యదృష్టవశమున నీవు నేఁడిచ్చట లభించితివి-ఇఁక మా పురమునకుఁ బోవుదము రమ్ము. లెమ్ము.

మొద—సఖుఁడా! ఇది సరిఁ దగదు. నేనీమెను వరించితిని. అట్టి దానిని నీవేల కోరెదవు? (కాంతామతిని జూచి) చెలీ! ఈతఁడు బాల్యచాపల్యమున నట్లు బలుకుచున్నాఁడు గాని నిన్ను గైగొనుట కీతఁడు తగఁడు. నీకంటెను వయసున జిన్నవాఁడు.

రెండ—రమణీ! ఈతని మాట లసత్యము. నాకంటె నీతఁడే చిన్నవాఁడు.

తే. గీ. అందచందములందు, స్త్రీ కెందు నీకు
సములు లేరు, పురుషులందు సములు నాకు
లేరు! గాన నాపల్కులఁ కే లేమ! చెవిని
జేర్చి! నను వరించి సుఖంబు కెందుమింక.

కాంతా—(తనలో) వీరిరువురును నాపై మరులుకొనియుండిరి. ఇదియుంగాక నాఁమీద వాంఛ, వీరిరువురకును గలహముగూడ గల్పించునట్లేయున్నది. ఇదియు మేలే. నేనెట్లయినను వీరిని మాటలచే వంచించి యావలకు దాఁటవలెను.

మొ—రమణీ! ఇంక జాగు సేయకుము- కాలహరణమునకు మదనుఁడు సైపఁడు- (సమీపించును.)

అనుబంధము 25

కాంతా—రాజకుమారా! దూరముగ నుండుము-పరసతులను గోరుట భావ్యము కాదు-

అనుబంధము 26

రెండ—రమణీ! మోహముదీర్పకుండుట భావ్యముకాదు.

కాంతా—నీవు వృద్ధిఁబొందఁదలఁచినవాఁడవు నన్నిటు గోర రాదు-నీదారిని నీవుపొమ్ము-

మొ—

తే. గీ. షడంఘ్రి వచింపనేల నీ భంగి నిపుడు
హరికిఁజిక్కనయట్టియా హరిణనయన
చిక్కితివినాకు నేడు నీ; తర్కమెల్ల
మాని; నాయభీష్టముఁ దీర్ప మదిఁదలంపు-

రెండ—అలివేణీ! నాయభీష్టము తీర్పుము.

మొ.—మిత్రిమా!

ఉ. ఏనువరించినట్టి నతి నివిధిఁగోరగ న్యాయమానె, యా
హా! నినువంటిస్నేహితుని నారయనైతి ధరాస్థలంబులో

రెండ.—

మానిని నేనె కోరి తను మాన మొకింతయులేదు నీవు నా
పూనిక కేల యడ్డదవు పొమ్ము సతిఁ గ్రహియింతు నేనికన్.

మొ—ఏదీచూతము-ఈసతినినీవెట్లు గ్రహించెదవో చూచెద గాక!

రెండ—ఏమిచేసెదవు? ఈసమయమునఁ బురహరుఁ డడ్డము వచ్చినను నాయుద్యమంబును వారింపలేడు-

మొ—నిన్ను వారించుటకుఁ బురహరుఁడు కావలయునా? (కాంతామతిఁ జూచి) నారీమణి! మనకీయనవసరపు గొడవలేఁ బని యేమి! రమ్ము. మనము పోవుదము.

(సమీపించుచు)

రం.—నారీ! నన్ను విడిచి యొక్కడికేగెదవు. రమ్ము.

(సమీపించును)

ము.—ఓరీ! నీసాహసము!

రంగ—ఓరీ! నీదౌష్ట్యము!

ము.—ఇఁక మాటలతోఁ బ్రయోజనమున్నట్లు తోఁచదు.

రంగ—మాటలుగాక చేయఁదలఁచిన దేమి?

ము.—నీవిట్లు చేయుచుంటివేని, కృపాణమునకుఁ బని కలిగి తీరును.

రంగ—అట్లనా! (కత్తి యొరనుండి తీసి, దీనిం జూచితివా? జాగ్రత్త.

కాంతా—(తనలో) ఈయిరువురును నానిమిత్తము తమలోఁ దాము కలహించుచున్నారు. నేను నెమ్మదిగా వీరిని మాయపుచ్చి యావల కేగుట కిదియే సమయము. (ప్రకాశముగా) రాజకుమారులారా! నాకై యేల మీరీరీతి కలహించెదరు? నాయందు మీకు నిశ్చయముగా మోహమున్నచో నేఁ జెప్పినట్లు ప్రవర్తింతురా! మీయిద్దఱికిని ననుకూలమగు సంగతి నేనొక్కటి చెప్పెద; అది మీకు సమ్మతమేనా?

రం.— } చెప్పుము. చెప్పుము.

కాంతా—ముందుగా మీ హస్తులను, ధనుర్బాణఖడ్గములను నాముందు బెట్టుఁడు.

(రాజకుమారులట్లు చేయుదురు.)

కాంతా—రాజకుమారులారా! గుఱిజూచి ఈశరమును నే నాదెసకుఁ బ్రయోగించెదను. మీలో నెవ్వరాశరమును దెచ్చి ముందు నాకిచ్చెదరో వానిని వరించెదను.

మొ }
రెం } బాగున్నది. అట్లుసేయుము.

కాంతా—(శరపరిత్యాగమును చేయును—రాజకుమారులు పరుగెత్తుదురు.)

కాంతా—(తనలో) వీరిని మాయచేత దుస్తు లిచ్చుటకుఁబెట్టించి-యావలకుఁ బంపితిని. ఇఁక నేను వారు రాక పూర్వమే యీదుస్తులను ధరించి ధనుర్బాణఖడ్గాది సాధనములఁగైకొని యావలకు వాఁటిపోయెద.

(రాజకుమారులు దుస్తులను ధరించి నిష్క్రమించును)

(రాజకుమారులు ప్రవేశింతురు)

మొ—ఏదీ! యాకాంత?

రెం—మనదుస్తులేవి?

మొ—మిత్రమా! ఆకాంత మనలను బూర్తిగావంచించినది. పరాంగనను గోరిన మనకుఁ బ్రాయశ్చిత్తము బాగుగ నైనది.

రెండ—ఏమైనను, మనము దుస్తులులేనిదే పురమును బ్రవేశించితిమేని, ప్రజలు మనలఁజూచి నవ్వుదురు. కావున నేవిధముననైన నాకాంతను వెదకుదము. ఈయరణ్యమును దాఁటి యామె యెందు బోఁగలదు. తొందరగా రమ్ము.

(ఇరువురును నిష్క్రమింతురు)

{ పురుషవేషమున కాంతామతి యొకచెట్టుక్రింద నిద్రించుచుండును. ఉద్యానవనమున గళింగరాజపుత్రికయగు సుమతి-చెలికత్తెయగు నర్మదతోఁ బ్రవేశించును.

నర్మ—రమణీ! నేఁడదియేమోగాని యెంతపిలిచినను వనవిహారమునకు సత్వరముగ రాక దక్కితివి.

సుమ—సఖీ! ఏమికారణమని చెప్పుదును. మూడు నాలుగు దినములనుండియు నాచిత్తము మిగుల నారాటమందుచున్నది.

నర్మ—నీయారాటమునకుఁ గారణము నాకుఁ దెలియదనుకొంటివా! భర్తకొఱకే కదా యీ వెంగ;

సుమ—చెలీ! నాబహిఃప్రాణమవగు నీయొద్ద దాపటికమేము న్నది. నాతండ్రి జీవించియున్నచో నాకింత పరితాపముండదు. నేను దురదృష్టవతినగుటచేతనే యాతఁడు దివమలంకరించినాఁడు. మంత్రిసత్తముఁడగు సుధర్ముఁడు నేనువరించిన రాజకుమారునకు నన్ను వివాహము జేసి యాతనికి రాజ్యాభిషేకము చేయుదుననని పలికెను. ఇంతవఱకును నాహృదయము నాకర్షింపఁగలిగిన రాకొమారుఁడే కనిపింపఁడయ్యె. ఏమి సేయుదును.

తే. గీ. నాకు నెనయైన సతులెల్ల ! నవ్యమోద
ము వివాహమాడి సుఖము ! బొందుచుండ
నన్నియుండియు నాబ్రతు ! కక్కటకట
యడవిగాచిన వెన్నెల ! వడువుగాదె.

నర్మ—అమ్మా! నివ్వుచింతింపవలదు. నీకు శుభదినములు సమీపించినవని మనపురోహితుఁడు చెప్పియున్నాఁడు (ఇంచుకయూరకొని) ఆదెనకుఁ బోవుదమురమ్ము,

(ఇరువురును ఇంచుకనడతురు.)

సుమ—(నిద్రించుచున్న పురుషవేషధారియగు కాంతామతిని జూచి) చెలీ! ఆనిద్రించువారెవ్వరు. ఇయ్యది స్త్రీలువిహరించు వనంబని తెలియక వచ్చెనుకాఁబోలు!

నర్మ—(పరికించి) ఆహా! ఈతనిరూపము జగన్మోహనమై యున్నది. మార్గాయాసమున మిగుల డస్సియుండి నిద్రనుమునింగి యున్నాఁడు.

సుమ—(ఇంచుక నడచి పరికించి) ఓహో! ఏమి యీతని రూపము

తే. గీ. విబుధ పతిసుతు కంటెఁ గు రే బేరు పట్టి
కంటె; యామినీ నాథుని కంటె; మదను
కంటె; నెక్కుడై విలసిల్లు ఘనత యీని
యందు నమరి యున్నదటంచు నంపగఁదగును.

(తనలో) డెందమా! తొందరపడకుము.

నర్మ— సఖి! ఈతఁడు నీచిత్తమును హరించినట్లు తోఁచుచున్నది

సుమ. నవ్వును)

నర్మ—ఈతని ముఖలక్షణములు చూడ నొక రాజకుమారుఁడని తెలియుచున్నది. సుమతీ! నీవిఁక గృతార్థురాలవగుదువు. పరమేశ్వరుఁడు నీయెడల గరుణించి యీనవమోహనాంగుని ని బంపెనని తోఁచుచున్నది.

సుమ—అంతటి భాగ్యము నేను నోచుకొని యుంటినా?

(కాంతామణి కదలుచుండును)

నర్మ—అదిగో! ఆతఁడు మేల్కొనుచున్నాఁడు.

(ఇరువురు సమీపించి ప్రక్కగా నుందురు)

కాంతా—(మేల్కాని యిటునటుజూచి) అబ్బా! ఎంత నిద్ర పట్టినది. ఓహో! యియ్యది కాంతలు విహరించు నుద్యానవనము కాఁబోలు, ఎటుఁగక యిందుఁ బ్రవేశించితిని. ఇక్కడనుంచి నేను పురుష వేషము నటింపవలయును. ఇది మహాకష్టమైనపని.

సుమ—నర్మదా! వారి యుదంతమారయుము.

నర్మ—(సమీపించి) పుణ్యపురుషా! నీ వెవ్వరవు. ఇచ్చటకు రాఁ బనేమి! అడిగినందులకు మన్నించి వచింపఁగోరెదము.

కాంతి—యోషామణీ! నేనొక రాజకుమారుఁడను. పేరు కాంతివర్మయందురు. నేనొక కార్యార్థినై యిట్లువచ్చితిని. మీరెవ్వరు?

నర్మ—ఆర్యా! ఈమె కళింగరాజపుత్రియగు సుమతి. నే నీమె చెలికత్తెను. మీరువచ్చిన కార్యము మే మెఱుంగఁగూడదా! ఏదియేని సంబంధము నరయుటకు వచ్చియుందురా?

కాంతి—అదియేయైనచో మాతో నేమైన సంబంధము సేయుదురా?

నర్మ—దేవా! ఆగ్రహింపవలదు. అనుగ్రహించినచో సంబంధమిక్కడనే దొరకఁగలదు.

కాంతి—ఎట్లు-

నర్మ—రాజపుత్రా! ఈసుమతి తండ్రి మరణించి యొకవత్సరమైనది. నాఁటినుండియు రాజ్యపరిపాలనము కళింగపతికి కుమారులులేకపోవుటచే ధర్మసంధుఁడగు సుధర్ముఁడనుమంత్రియే చూచుచున్నాఁడు. అతఁడిక్కాంతామణి కోరుకొనిన రాసూనుందెచ్చి వివాహముచేసి పట్టముగట్టెదనని చెప్పియున్నాఁడు. మా చెలిభాగ్యవశమున నేఁడు మీరిచ్చోట కరుదెంచిరి. ఇంతకుము న్ననేక రాకుమారులనుఁదిలకించి సమ్మతింపని మాసుమతిచిత్తము మీయందుఁజిక్కినది. కావున ననుగ్రహించి యామెను జేపట్టి కళింగరాజ్యాధిపత్యము వహింతురుగాకయని నాప్రార్థనము.

సుమ—మహానుభావా! అదియే నాప్రార్థనము-

కాంతి—(తనలో)

తే॥ గీ॥ ఏనుయువిదనుభర్తనై యిట్టిపురుష
వేషమును దాల్చినాఁడను వెలఁదినన్ను
నాత్మపతిగవరించె నే నందు నిప్పు

దకట మార్గమేమియుఁదోఁచకే దయ్యో నాకు!
నేను స్త్రీనని చెప్పినచో నేమిహాసివచ్చునో.

సు—మమనోహరా! దీర్ఘాలోచనము సేయుచుంటిరే.

కాంతి—(తనలో) ఇట్లు చెప్పిచూచెదఁగాక! (ప్రకాశముగాఁ) బ్రియకాంతావియోగము గలుగుటఁజేసి, నేనిట్లు వచ్చితిని.

సుమ—అదియెట్లు?

కాంతి—కొండొక కారణమున నేమరణ్యమునఁజరించుచుండ నాభార్యను విధివశమున బాసి, తదన్వేషణార్థమై యిట్లు దిరుగుచున్నాఁడ- ఇట్టినిర్భాగ్యునకు నాకిప్పుడు వివాహమేల? రాజ్యమేల?

(అనుబంధము 27.)

సుమ—(అనుబంధము 28.) ఆర్యా! నేను మిమ్ము సంపూర్తిగ నాజీవితేశ్వరుఁడవనినమ్మితిని. ఇందులకు మీరంగీకరింపరేని నాదారిని నేను జూచుకొనియెదను, గాని యొరులను వరింపను. మీరు నాయందుదయయుంచి. పురమునకువిచ్చేసి నన్ను గ్రహించి రాజ్యభారమును బూనుఁడు. మీకాంతనరయుటకు వలసినచారులును బంపవచ్చును.

కాంతి—(తనలో) ప్రస్తుతమిది బాగుగనున్నది. (ప్రకాశముగా) రమణీమణీ! నేనొకటి చెప్పెదను. నీవందులకంగీకరింతువేని నీయభీష్టము దీరగలదు.

సుమ—దేవరయాజ్ఞకు బద్ధురాలను.

కాంతి—అట్లయిన నీకోరికననుసరించి ముందు రాజ్యపరిపాలనాభారము వహించెదను. నిన్ను వివాహమాడుట కాఱుమాసలు

గడువీయవలయును. ఈలోపుగ నా కాంత జాడలనరయవచ్చును. పిదప నీవు కృతార్థురాలవగుదువుగాక-

సుమ—మీయిష్టమువచ్చినట్లనుగ్రహింపుఁడు-పుగమున కేగుదము- రండు.

(అందఱునునిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.





# కాంతామతి

## షష్ఠాంకము.

రంగము:—[ఊరువెలుపలి సత్రము—ముందు కాంతామతి చిత్రప్రతిమ—యుండును—ఇరువురు సేవకులు ప్రవేశము.]

మొ—మన క్రొత్త రాజుగారి వ్యాపారమంతయు బహుచిత్రముగా నున్నది.

రం—చిత్రమా! అతిచిత్రమా! సుమతీదేవిగారితో మాట్లాడడట, వివాహము జేసికొనఁ దలచినప్పుడట్లు సేయుట కేమి కారణమో?

మొ—మన కేమి తెలియును—(ఇంచుక యూరకుండి) ఈస్త్రీప్రతిమను సత్రమువాకిటనిలిపి, దీనింగని యేడ్చువారిని బంధించి తనకడకుఁ గొనిరమ్మని కాంతివర్మ యాజ్ఞయిచ్చుటకుఁగూడ గారణమూహింపజాలకయున్నాను.

రం—ఆగుము—ఎవరో యిట్లు వచ్చుచున్నారు—

(ప్రవేశము—ధనపాలుఁడు)

ధన—(తనలో) నాకుసెడ్డబుద్ధిపుట్తే నామనస్సుతిప్పేసి మంచి మార్గములో పెట్టిన యాయమ్మజాడే తెలియడంలేదు. మాయింట్లో

వుండగా దుర్మార్గుఁడయిన దుష్టబుద్ధి బలవంతముగా దీసికొనిపోయినా
డు. ఆడినత్తినిశతగోవపెట్టి యెల్లిందని విన్నానుగాని-యెక్కడికెల్లిందో
యేవిటో-పాపం-(ఇంచుకనడచి చిత్రప్రతిమనుజూచి)ఆశ్చర్యం ఏవిటీ!
ఆశ్చర్యం- ఆనాటి అమ్మాయి యిక్కడవుంది. (సమీపించి) అమ్మా
నువ్వునాకుతల్లంటిదానవు. నాకుమంచిబుద్ధిసెప్పినావు. నిన్నెక్కడన
యినా సూడగలుగుదునేమోయని నచ్చినందుకు చూచినాను- మొ)
క్కి) అబ్బే, ఇదిమనిషి కాదు. రాయిలానున్నదే. అయ్యో! అమ్మా!
రాయైపోయినావా! (విచారించును.)

మొద—ఎవరునీవు! ఈవిగ్రహమును జూచివిచారించెదవేల?

ధన—మీారెవరేవిటి.

రెండ—మేము రాజభటులము.

మొ—పద-పద చెఱలోకి-

ధనం—ఇదేవిగ్రహచారం-నేనుకోవటోణ్ణి-ఇదిగో. నామాట
యినండి- అసలుసంగతేవిటి- నీకు పుణ్యముంటుందిగాని నన్నొదిలె
య్యండి.

రెండ—నీకు భయంలేదు. (ఇరువురును నాతనిసిఁ దీసికొనిపోవు
దురు.)

దుష్టబుద్ధి—(ప్రవేశించి తనలో) హా! శ్యామారత్నమా!
నన్నెంతమోసపుచ్చితివి. నీవిట్లొనర్చెదవని నాకించుక తెలిసియున్న
చో జాగరూకతతో మెలఁగియుందునుకదా! నీయనుగ్రహమువడసి
నిన్నుగూడ దలంచినందులకు గదా నన్నిట్లుచేసినావు. అఋమాసముల
దీక్షయున్నదనియు గౌరీవ్రతము సేయవలసియున్నదనియు, జెప్పి నా
కున్న ధనమంతయు ధనాగారమునకు నొక్క యరకానయిన లేకుండ
ఖర్చుపెట్టించి, తుదకుమాయమైతివే. అక్కటా! నాబ్రదుకు నలు
గురును నవ్వునట్లు చేసిపోయితివే—ఇంతధనము పోయినను నాకు విచా

రము లేదుగాని, నీజాడ యెక్కడనైనఁ దెలియునేమో యని నీకై నానా పరిదేశముల నరయుచుంటిని.

(భటులు—ప్రవేశింతురు)

ము—రా! రా! ఇదిగో! మనము వచ్చునప్పటి కిచ్చట మరల నెవరో సిద్ధముగ నున్నట్లున్నారు

దుష్ట—(సత్రముకై చూచి) ఇయ్యది సత్రము కాఁబోలు. నేటికిందు విశ్రమించెదఁగాక-(ఇంచుక నడచి- ప్రతిమను జూచి) ఆహా! అదిగో కాంత! ఆకాంత-హా! కాంతామణీ! నన్ను వంచించి యిచ్చట నిలచి యుంటివా! నాచేత నంత ధనము వెచ్చింపఁజేసి యిట్లు జేరితి వా! నాయెదుట నిప్పుడు పడిన నీవిఁక నెక్కడకే గఁగలవు? (సమీపించి) ఇదియేమి వింత-రాతిబొమ్మను జూచి రమణినిగా దలఁచితినే- నాబుద్ధి మాంద్యమున కేమనుకొందును- హా! నారీమణి! నీవెంత మాయలాడివి ?

తే. గీ. నన్ను గైకొందు నంచును నమ్మఁబలికి
ప్రీతినిమిత్తము సర్వంబు వ్యయము జేసి
నెత్తిపైనాకు శఠగోప మెత్తితుదకు
రాయిగా మాఱితే యిట్లు రాజవదన.

హా! ఎంతదానవు! ఎంతదానవు!

ము—ఎవరు నీవు? పద పద- బందిగములోనికి.

దుష్ట—బందిగమేమి !

రెండ—ఈప్రతిమను జూచి దుఃఖించినవారిని బందిగములోఁ బడవేయుమని మారాజుగారి యాజ్ఞ.

దుష్ట—నేనును నొక్క రాజునే.

ము—అయిన మాకేమి, ఒక వూరి కాపు మఱియొక యూరి కి మాల యన్నారు-పద-(దుష్టబుద్ధిని దీసికొని పోవుచున్నారు)

(అనుబంధము 29)

దొంగ——(ప్రవేశించి) అమ్మా! ఎంతపని సేశావే! మంచిమస్తులేస్కానిరా. నుట్టాలనుతీస్కానిరా అనిసెప్పి తీరావచ్చే సరికి నన్ను బుట్టలో యెట్టి నల్లంగాదాటావు. అమ్మ శిఖండీ! ఈసారికనిపిత్తేవొదులుతాననుకొన్నావు. ముక్కముక్కలుగా సెక్కల్సెయ్యనా! లేకపోతే పెండ్లాడనా ?

(భటులు ప్రవేశింతురు)

మొ——ఓరీ! వీఁడెవఁడో మరల సిద్ధమయినాఁడు. వీనిమొగము చూడు.

దొంగ——(తనలో) నాదేహంలోపాణాలుండగానిన్ని డుస్తాను? ఎక్కడున్నా పట్టుకుంటాను. (సతిమునుజూచి) ఇదేందో చత్రింలాగుంది. ఇక్కడ కాంతవుండుకొని సీకటడ్డాక మళ్ళి యెళ్ళితే బాగా వుంటుంది. లేకపోతే ఓరన్నా చూశారంటే నామొగమునుసూచి దొంగోడు అనిపట్టుకొన్నారంటే దిక్కుండదు——(ఇంచుకనడచి ప్రతిమనుజూచి) అమ్మా! సీతల్లిసిగగొయ్య నన్ను మోసముచేసి యిక్కడికొచ్చావు. ఇకతప్పించుకొనిపోదువుగాని, డొక్కచీల్చేత్తా; యెవికలు కొఱికేత్తా; ఇఁకనీయేసాలుసాగవు. (ప్రతిమనుతన్ని) ఓయిబాబో! ఇదేంట్రా దేవుఁడా! నన్ను పెళ్ళాడ్తానన్న పిల్ల రాయై పోయిందిరా! అయ్యో! ఇంకేవుందా దేవుఁడా! కాంతా! రాయైపోనావా! నన్నుగూడా నీతో పాటు రాయిసెయ్యలేకపోయినావు. (ఏడ్చును.)

మొ——(దొంగనుపట్టుకొని) పద-ఖైదులోనికి-

దొంగ——అయ్యబాబో నేను దొంగనుకాదండీ! నన్నిడిపిచ్చండి.

రెండ——మాట్లాడకరమ్ము——(తీసికొనిపోయి వెంటనేప్రవేశింతురు.)

మొ—ఓరీ! అటుజూడుము-ఎవరో యిరువురు సుందరపురుషు లిట్లు వచ్చుచున్నారు.

(రాజకుమారులు ప్రవేశింతురు)

మొ-రా—మిత్రమా! ఇటుజూడుము. మనముపడిన కష్టము ఫలోన్ముఖమునకు వచ్చినది. ఇదిగో మనలను వంచించిన చంద్రాస్య;

రెం-రా—ఏదేదీ! (చిత్రమును జూచి) అమ్మా! ఇప్పటికి దొరి కినావు. ఇంకమమ్ము తప్పించుకొనుటకు నీకుఁ దరముగాదు.

మొ-భ—(సమీపించి) మీరెవరో రాజపుత్రులవలె నున్నారే-

మొ-రా—అవును.

రెం-భ—చిత్రప్రతిమను జూచి యిట్లు సంభాషించెదరేమి?

రెం-రా—ఇది చిత్రప్రతిమా! జీవములధరించియున్న మానవాంగన కాదా?

మొ-భ—కాదు కాదు.

రాజకుమారులు—హా! (మూర్ఛిల్లి లేచెదరు)

మొ-భ—అయ్యో! మీరుమా రాజుగారిసన్నిధికి రావలయును ఈచిత్రప్రతిమను జూచి చింతించువారిని దెమ్మని వారియాజ్ఞ; రండు-

(తీసికొనిపోవుదురు.)

(చిత్రసేనుఁడు సన్యాసివేషమునఁ బ్రవేశము)

చిత్ర—హా! కాంతామతీ! నామూలమున నీవెన్నియిడుముల గుందుచుంటివోకదా! వేశ్యావ్యామోహమునఁ జిక్కి నిన్ను వనంబులపాలుగావించితినని నైన విచారింపక, యే తెఱంగుననైన నాసేవసే యఁగోరి యనేకకష్టములఁ బడుచుంటివి. దుష్టబుద్ధి మందిరమున నన్ను గాంచినందులకెంతయో సంతసించితివి, మనమిరువురమును నర్ధరాత్రి

యావలకుఁ బోవుదమనిపలికితివి. ఇంతలో నేదుర్మార్గుని చేతనో నీవు వంచింపఁబడి కొనిపోఁబడితివి. అరణ్యములన్నియుఁ దిరిగితిని. నగరంబులన్నియు వెదకితిని. నిజాడయెందును గనఁబడదయ్యెను.

తే. పరమనిర్భాగ్యుఁడీతఁడు పాపియనుచుఁ
దలఁచినామీఁద కృపవీడి తరుశిమిన్న
మొలకునైనబోయితివో యీశరీర
మేలయని మేను దొఱఁగితో యేమిసేతు.

హా! పర్వేందువదనా! నిన్నుగాంచుభాగ్యము నాకున్నదా?

తే. వెలఁది! సాధ్వివనుచు నిన్ను పలుకఁదగును
నామురాకఁ గోరుచు దుష్ట నరపతిగృహ
ముఁదుజక్కిగారీవ్రతం బనెడినెపము
పెట్టి యతని ద్రివ్యంబెల్ల వెచ్చఁబెట్టి
యచట నను జూచి మోదంబు నందినావు
నిన్నుగొనలేకమోనంబు నేనెగంటి.

సచ్చరిత్రవగు నీతోనుండుభాగ్యము నాకు లభించునా?

(భటులు ప్రవేశింతురు)

మొ—ఓరీ! మరల నెవఁడో సన్యాసివచ్చినాఁడు.

చిత్ర—ఇదిగో! సత్రము-ఇందు జేరి మార్గాయాసము వాపుకొందుఁగాక: (నడచి ప్రతిమనుజూచి) హా! భాగ్యము! ఇదిగో! నాకాంతామతి (సమీపించి)

తే. పడఁతి నీనిమిత్తము నేను పడినశ్రమము
వాపితిని గన్నులుండిన ఫలముగాఁగఁ
గాంచఁగల్గితి నిప్పుడు కళవుదీర
గాఁగిలించి కృతార్థతఁ గాంచువాఁడ.

(సమీపించును)

రం—అయ్యా! మీరెవ్వరో యతీశ్వరులవలెనున్నారే. ఈచిత్రపటమును జూచి తొందర పడెదరేల?

చిత్ర—ఇది చిత్రపటమా! నాజీవితేశ్వరియగు కాంతామతి కాదా! హా! ప్రాణప్రియా! (మూర్ఛిల్లి లేచును)

మొ—యతివర్యా! మీరు మారాజుగారికడకు రావలయును రండు.

(తీసికొనిపోవుదురు)

రంగము:—సభాభవనము

[పీఠంబులయందు కాంతివర్మ సన్యాసివేషమునున్న చిత్రసేనుఁడు మంత్రియగు సుధర్ముఁడు-నాసీనులై యుందురు. ధనపాలుఁడు-దుష్టబుద్ధి దొంగ-రాజకుమారులు నొకమూల నిలబడియుందురు.]

కాంతి—(తనలో) ప్రాణేశ్వరుఁడనుటనుండఁగా నేను మాటలాడక యూరకొనవలసివచ్చెనుగదా. నేనీవేషమును బూనుట యీతనికొఱకేగదా? నేనీసమయమున నాచిత్తమును బదిలపఱచుకొనవలయును. నానాథునిచిత్తవృత్తిగూడ నరయవలయును. (మంత్రినిజూచి) మంత్రివర్యా! చిత్రప్రతిమనుజూచిదుఃఖించినవారినొక్కొక్కరిని విచారింపవలయును. ముందావైశ్యునిటు బిలువుము.

మంత్రి—సేవకా! ఆవైశ్యుని రాజుగారియెదుట నిలుపుము.

సేవ—(అట్లుచేయును.)

ధన—(తనలో) యిదేంకర్మం నన్నేమిచేస్తారో?

కాంతి—ఓయీ! వైశ్యుఁడా! నీపేరేమి?

ధన—(దనలో) పేర్రాసుకొంటారు కాబోసు. (ప్రకాశముగా) ధనపాలుఁడంటారు బాబయ్యా! ఏలినోరికి తెలియందేవుంది;

కాంతి—సత్రముయొద్దఁ గట్టఁబడిన చిత్రప్రతిమను జూచి నీ

వేల విచారించితివి. అందలినిశ్చయమును జెప్పుము; లేదేని దండింపఁ బడుదువు.

ధన—(వణకుచు) బాబయ్యా! అబద్దంసెప్పేటందుకు పాపిణంమీదికేవొచ్చింది ఇదిగో యినండి- నేనోరోజు పొద్దునే లెగిచి మావూరు దగ్గిరవున్న పల్లెటూరులో బాకీలు వసూలుసేసుకోడానికెళ్ళుతూవుంటే, యాబొమ్మలోవున్న స్త్రీ, అరణ్యంలో కనిపించిందండి. ఆమట్టుకా నేను ఆమెను నాయింటికి తీస్కొచ్చాను. తరువాతనాయింటోవున్న సంగతి తెలిసి యీదుష్టబుద్ధి రాజుగారు బలవంతాన భటులనుపంపించి ఆయనయింటికి తీస్కొని వెళ్ళినారండి ఇదిసంగతండి-

కాంతి—నీవబద్ధము చెప్పుచున్నావు. నిన్ను దండించినగాని నిజముబయలుపడదు. నీవాకాంతవిషయమైయన్యథాప్రవర్తింపలేదా!

ధన—బాబయ్య—బాబయ్యా—(తనలో) దాసినాగాని దాగేటట్టులేదు! నిజంచెప్పేసి రక్షించమని కోరుకొంటేమంచిది. (ప్రకాశముగా, మహాప్రభూ! అడవిలోనుంచి యీమెను యింటికి తెచ్చిన తరువాత నామనస్సులో కొంచెం యికారంపుట్టిందండి; బుద్ధిగడ్డితిందండి; ఇక ఏలినవారివద్ద దాసడంయెందుకు శిక్షించినాసరే, రక్షించినాసరే యికారంపుట్టినప్పటికి నింపాదిగా ఆమెదగ్గిరకెళ్ళి సంగతి చెప్పేశానండి.

కాంతి—ఆమె అందులకంగీకరించెనా?

ధన—లేదు బాబూ! నాకెన్నో బుద్ధులు చెప్పి నామనస్సుతిప్పేసిందండి. అల్లాంటి యీపాపంమీద రోతపుట్టించిందండి.

కాంతి—ఆమెవాక్యములచే నీబుద్ధిని మరల్చుకొంటివా?

ధన—ఇందులో కల్లయేమీలేదండి ప్రమాణంగా నిజంచెప్పినానండి.

చిత్రి—(తనలో) ఆయువతీమణి నాభార్యయే యైయుండవచ్చు ను—హా! ప్రియసీ! కాంతామతీ!

కాంతి—(చిత్రసేనునింజూచి) యతివర్యా! మీనిమాటలు న మ్మవచ్చునా?

చిత్రి—నమ్మందగినవే యైయున్నవి.

కాంతి—సరే! నీవట్లుండుము—సేవకా! దుష్టబుద్ధినృపాలు నిటకుం దోడ్కొనిరమ్ము.

సేవ—(దుష్టబుద్ధినెదుట బెట్టును)

దుష్ట—(తనలో) ఆహా! ఈనృపాలుండు నాయుదంతమునంత యు నడుగును కాబోలు. ఏమిసేయుదును?

మ. పరనారీమణిఁగూడఁగాఁదలఁచి ద్రవ్యంబెల్ల గోల్పోయి యీ
కరణిన్ ఘోరదరిద్రతన్ మునిఁగి లోకంబోతయున్ నవ్వ; నా
సరసీజాక్షి యుదంతమారయఁగ నిచ్చన్ జేరి యిచ్చోట; యీ
ధరణీపాలుని చేతఁజిక్కితిని నాదౌర్భాగ్య మిట్లొప్పఁగా.

కాంతి—(దుష్టబుద్ధినిఁజూచి) అయ్యా! నీవొక నరపాలుఁడవు కదా నివాచిత్రప్రతిమను జూచి యేలయేఁప్రితివి. నిజము వక్కాణిం పుము.

దుష్ట—నరపాలా! నేను రాజునయ్యు, పురాకృతకర్మమువలన దుష్టుఁడనైతి. ఆచిత్రమునలిఖింపఁబడిన నాతి ధనపాలునియింట నుం డుట యెఱిఁగి, భటులనుబంపి బలవంతముగ నాగృహమునకుఁ దెప్పిం చితిని.

కాంతి—నామమును సార్థకము జేసికొంటివే. తిరువాత నేమి చేసితివిఁ?

దుష్ట—నేనామెంగాంచి మారుబారికిలోనైనాయభీష్టము దెలిపితిని. అందుకాసాధ్వి యనేకవిధముల నీతులు బోధించెను. ఆసమయమున నవి నాతలకెక్కవయ్యె. అప్పుడాయువతి తనకాఱుమాసములు దీక్షయున్నదనియు, గౌరీవ్రతంబొందు సేయవలసి యున్నదనియు నది పూర్తియైనపిదప నీయభీష్టము దీర్చెదననియుఁ జెప్పెను.ఆమెపైనుండు మోహమున నేనందుల కంగీకరించి యావ్రతార్థమై వలసిన ధనమంతయు నిచ్చితిని. ఇన్నిమాటలేల! ధనాగారమున నొకయరకానయును లేకుండ నంతయు ఖర్చుపెట్టితిని. తుద కాఱుమాసములు గడువు ఇక ఆరురోజులుండగా, సీకాంత యెట్లో నామందిరమునువిడిచి యర్థరాత్రిసమయమున దప్పించుకొని పోయినది.తదాదిగా నేనక్కాంతకై యన్వేషించుచు, నియ్యొడకరుదెంచి యీపత్రికను జూచి నన్నింతవానిగా జేసెనుగదా యని దుఃఖించితిని—

కాంతి—ఇన్నిమాసములు నీయొద్దనున్న యక్కాంత నీయభీష్టముదీర్చుట కంగీకరింపలేదా!

దుష్ట—రామ రామ. నన్ను కేవలము వంచించుటకే యాసాధ్వి యిట్లొనర్చినది.

తే॥ గీ॥ పరసతీమణిఁ గుంచు భావమునఁ దలఁచ
కట్లు జేసినందుకు ఫలంబె బనుభవించి
నాఁడ! వ్యర్థుండనైతిని నాఁగఁ బ్రిదుకు
జనులు పరిహాసింపగనయ్యె తప్పేతలేందరి.

కాంతి—ప్రిజలనేఁటవాఁడవయ్యె. నిట్టి దురుద్యోగమున బ్రవర్తింపఁదలఁచిన నీకు బుద్ధి యిప్పటికైన వచ్చినదా?

చిత్రి—(తనలో) ఈదుష్టబుద్ధిని వంచించినది నాకాంతయగు కాంతామతియే. హా! సతీమణి! నీవెందుంటివో కదా!

కాంతి—(తనలో) నాథుఁడందుచున్న పరితాపమును జూచి నేను తాళవలసివచ్చి దికదా—(ప్రకాశముగా) తాపసోత్తమా! ఆకాంతామణి సాధ్వియేయందురా! ఆనారిని మరల భర్త స్వీకరింపవచ్చునా?

చిత్రి—సంశయము లేదు. ఆమె సాధ్వియని చెప్పవచ్చును భర్తచే నామె స్వీకరింపఁబడ నర్హురాలు. (తనలో) అక్కటా! నా కాంతామతి యెందు బోయెనో కదా!

కాంతి—(దుష్టబుద్ధినిఁజూచి) దుష్టబుద్ధినృపాలా! నీవాప్రక్కనుండుము—సేవకా! ఆదొంగనిచ్చట నిలుపుము—

సేవ—(అట్లు చేయును)

దొంగ—(తనలో) అయ్యో! దేవుడా! ఈళ్లు నన్నేంజేస్తారో రా—నాయనా! వాళ్లొణుకుతుండాది.

కాంతి—(దొంగనుజూచి) ఓరీ! నీవాచిత్రిమును జూచి యెందుకేడ్చితివి.

దొంగ—(తనలో) కొంపతీశాండ్రా! దేవుడా!

కాంతి—మాట్లాడవేమి! సత్యమంతయుఁ జెప్పుము. లేదేని నీతల దీయించెదను.

దొంగ—మా ప్రభో! నాప్రాణంపోయినా నిజద్దేసెప్తాను. మరి గత్తే. బాబూ! అది నాపెళ్లావాండి—

కాంతి—(కోపముతో) ఛీ! నీచుడా! ఆపటమునన్న యువతి నీకుభార్యయా! నిజము చెప్పుము.

దొంగ—లేదండి—మా ప్రభో. (తనలో) ఈడు యవ్వుడులాగ దాపరించాడ్రా! ఇహఁవొదలడు.

కాంతి—ఏమి చెప్పవు.

దొంగ—అదే బాబూ! చూస్తున్నాను. మరిగంటే నేనే దుష్టబుద్ధయ్యగారింట్లోవోకరాత్రికన్న వెయ్యడాన్కెళ్లోనండి—యెళ్లి,కన్నవే

శానండి. గడియ తియ్యడానికి లోపల సెయ్యెట్టమో యేటప్పటికి సిటు క్కున బాబయ్యా, వంసెప్పను, దానితల్లిసిగాగొయ్యా, ఎక్కడనుంచి దాపరించిందో. అబ్బా! సెప్పనలవి కాదంట—యేం బాధనుకొన్నారు. వగోడికైనావద్దు—

మంత్రి—సంగతి చెప్పుటకు జాగుచేసెదవేమి.

దొంగ—పెభువులడిగినప్పుడు మొదలుకాడనుంచి సివర దాకా సెప్పకపోతే యేలాగండి.

మంత్రి—కానీ.

దొంగ—ఇదిగో. సెప్పేస్తున్నా. పెభువులు రచ్చించినాసరే—భచ్చించినాసరే—అప్పుడు నల్ల తేలొడిసింది బాబూ. ఎందుకొచ్చా నా యీమూలకన్న వేయడానికి, పొద్దున్నే యెవడిపాడుమొగం సూశానాలని తెగయేడ్చానండి—

కాంతా—తరువాత చెప్పుము.

దొంగ—అలా యేడుస్తుంటే, ఆపలంగాగోడదగ్గిరొక నిచ్చెనుంది బాబయ్యా. ఆనిచ్చెనముందు సూసుంటే కన్నంతో పనే లేకుండాపోయిందను. అప్పుడా నిచ్చెనెక్కి లోపలికెల్దాం అనుకుంటూవుండే పాళానికి, ఒకసిన్నది "ప్యాడేశా—గట్టిగామాట్టాడకు. వత్తుండా" అనికలికి నిచ్చెనెక్కి దిగొచ్చిందండి-నేనుముందు. అదియెనక అక్కడనుంచి యిద్దరము బయలుదేరి మావూరిదగ్గిరసావున్న అరణ్యానికొచ్చావండి—

చిత్ర—(తనలో) హా! తరుణీ! నాటిరేయి నిన్ను చోరుఁడు వంచించెనా! ఇప్పుడెందుంటివి. నేను తలంచినట్లే యైనది—

కాంతి—ఓరి వెధవా! ఎంతపనిచేసితివి.

దొంగ—(తనలో) ఈళ్లు నాపాణాలు తీస్తారుకావోసు దేవుడా! ఇక్కడికెందుకొచ్చానురా!

కాంతి—తరువాత నేమైనది?

దొంగ—అడవిలోకి తీస్కొచ్చి, నన్ను పెళ్లాడమని యేడుకొన్నానండి—ఎంత యేడుకొన్నా, కుసింతాన్నా మనసొగ్గలేదు బాబూ. అఖరికండి—పెబువులికి దండవెట్టిసెప్తాను, యేడగాయేడగా, నిన్ను పెళ్లాడ్తానుగాని యీయేసం—యీగుడ్డలు బాగుండలేదు నువ్వు యింటికెళ్లి మంచివస్తురేస్కొని, సుట్టాలతోన్నూ, భాజాభజంత్రీలతోన్నూ వస్తే పెళ్లాడ్తానందండి. చామూర్త్యంగా నేను దాన్ని నమ్మలేదుకాని బాబయ్యా, యెట్లాగయితేనేనన్ను నమ్మించి వూళ్లోకంపిందండి—ఆపలంగా నేనెల్లి మంచిదుస్తులేస్కొని—సుట్టాల్ని, బాజాలినీ తీస్కొచ్చేసరికి కంటోకారంకొట్టి తప్పించుకెళ్లిపోయిందండి. పెళ్లికోసంవచ్చిన సుట్టాలు నామాటబద్ధాలని నన్ను మక్కలిఱగవాడిచారండి. ఆనొప్పి యింకాతగ్గలేదండి మళ్లీ నన్ను బుట్టలోపెట్టెల్లిన యీపిల్ల కనిపిత్తాదేమో అని యెతుక్కుంటూ యీవూళ్లోకొచ్చి చత్రిందగ్గిర ఆబొమ్మను సూచి యింతపని సేశావుకాదా అని యేడ్చానండి.

కాంతి—(నవ్వును) సరే ! నీవక్కడనుండుము.

చిత్రి—యోషామణి ! తస్కరుని బారినుండి తప్పించుకొనుటకు మంచి యుపాయమారసితివి.

కాంతి—(సేవకునిజూచి) ఆరాకొమరులఁ బిలువుము—

సేవ—రాజకుమారులారా ! రండి—

కాంతి—(రాజకుమారులనుజూచి) రాజనందనులారా! మీరా ప్రతిమంగాంచి దుఃఖనిమగ్నులగుటకుఁ గారణమేమి?

రాజకు—దేవా ! అసత్యము జెప్పము. సుక్షత్రియకులమున జన్మించినవారమయ్యు మేమీవిషయంబున దుర్నీతిం బ్రవేశించితిమి. మేమీరుప్పురమును నొకనాఁ డరణ్యమున వేటకై యరిగితిమి. అందు మాకాప్రతిమంబోలు సుందరి కానిపించె కామాంధకారులమై మేమాయువతింగోరి, మాలో మేము కలహించితిమి. అప్పుడాయువతి

మమ్ము వారించి "మీరాయుధములను ధనుర్బాణఖడ్గములను నాముందు బెట్టుడు. నేనొకశరమును బ్రయోగించెదను. మీయిరుపురిలో నెవ్వరాశరమును ముందుగాఁదెచ్చి నాకొసంగెదరో వారినివరించెదనని చెప్పెను. అందులకు మేము సమ్మతించి యట్లు చేసితిమి. ఆనారీమణి శరప్రయోగము చేసినంతనే మేమిరువురము బరువెత్తితిమి. తరువాత గొంతసేపటికి మేము గమ్యస్థానమునకు వచ్చిచూడ యామెలేదయ్యె. మాయాయుధములు లేవు. ఆయుధములు లేవు. ఇదియే జరిగిన నిశ్చయమైన సంగతి—

కాంతి—(చిత్రసేనునిఁ జూచి) యతివర్యా! వీరిపలుకులు నమ్మవచ్చునా?

చిత్ర—ఇందసత్యముండదు. అక్కాంత వీరిని వంచించి తప్పించుకొనుటకాయుపాయము బన్నినది. నిశ్చయముగా నామె సాధ్వియని శరీరవముఁ బలుకవచ్చును.

కాంతి—నిశ్చయముగా నట్టిసతిని, భర్త స్వీకరింపవచ్చును గదా—

చిత్ర—సందియమేమియును లేదు. నృపాలా! మహాసంతాపవార్ధిలో మునిఁగియున్న నాకు నీమృదుమధురవాక్యములు కొంతయామోదమును గలిగించుచున్నవి.

కాంతి—మీరంతగా సంతాపవార్ధిలో మునుగుటకు గారణమేమి?

చిత్ర—ఏమున్నది. ప్రియకాంతావియోగమే. నీవిప్పుడు చేసిన విచారణమునకు గథానాయిక యీనిర్భాగ్యుని భార్యయే.

కాంతి—పాపము! ఆమె యరుదెంచెనేని గ్రహింతురు కదా—

చిత్ర—ఈనిర్భాగ్యుఁడట్టి పుణ్యముమ జేసికొనెనా? నరపాల చంద్రా!

తే॥ గీ॥ నీకుసామర్థ్య మున్నచో నిజవధూటిఁ
జూపి నామదినున్న సం తాపమెల్ల
బాయఁజేయఁగఁ జూమునా పతిభుతిసేతుఁ
బ్రాణదాతవటంచును బ్రార్థివేంద్ర.

కాంతి—(తనలో) ఆహా! నానాథుఁడు నాకై మిగుల పరితాపమునుబొందుచున్నాఁడు. ఇఁకనేనుతాళఁజాలను—

చిత్ర—(కాంతామతినుద్దేశించి)

మ. శరదిందుప్రతిమానబింబవదనా శాతోదరీ సుందరీ
సరసీజాక్షి! వినీలకుంతల! మహా చక్రస్తనీ! మోహినీ
పరమామోదకరీ! సదా శుభకరీ పాలింపగారావె; దు
ర్భరసంతాపమునందు గూలితిని ని ర్భాగ్యుండఁ గాంతామతీ.

కాంతి—మంత్రీ! నాచిత్తమూరాటమొందుచున్నది.

(నిష్క్రమించి—నిజరూపమునవచ్చి) ప్రాణేశ్వరా! నన్ను మన్నింపుఁడు—

చిత్ర—నాకు నయనపర్వమొనర్చుచున్నది కాంతామతివే నా? ఆహా! నాభాగ్యము—

దొంగ—(తనలో) ఇదోరా! ఆపిల్ల. ఈడు దానిమొగుడుకా వోసు! నన్ను సంపెయ్యదుకందా—

ధన—(కాంతామతినిజూచి) మాయమ్మా! నాకు నీతిబోధించి మంచోణ్ణిచేశావు. నల్లనితల్లీ!

గుప్త—(తనలో) పరకాంతారతి కానపడి లోకనిందకుఁ బాలయితినికదా!

మంత్రి—(కాంతామతిని జూచి)

తే. గీ. త్రోవనడచువానికి నిధి దొరకినట్లు
లడవిలోన నడచుపాంథుఁ డర్ధనిశిని
దీపమునుగన్న భంగి, సంతాపమెల్ల
నేను బాయ నిన్ గాంచితి నెలఁతమిన్న.

కాంతా—(మంత్రినిజూచి) అమాత్యవర్యా! ఇక్కడ జరగినసంగతి దెలిపి సుమతిం దోడ్కొనిరమ్ము.

మంత్రి.—(నిష్క్రమించును)

కాంతా—.నాథా! నాకథయంతయు, వీరివలన దెలిసినది కదా! ఈరాసూనులను వంచించి యిక్కడకు వచ్చి యిట్లుంటిని. ఈపురవల్లభుని తనూజ నన్ను బురుషునిగా భావించి వరించినది. ఆఱుమాసములు గడువు పెట్టితిని. కావున నావాగ్దానము ననుసరించి మీరామెను ననుగ్రహింపవలయును. (సేవకునిఁ జూచి) ధనపాలుఁడు మొదట దుర్బుద్ధిని బూసినను నాచేఁ బ్రబోధింపఁబడి నీతిమంతుఁ డగుటంజేసి వానిని విడిచి పుచ్చుము. (దుష్టబుద్ధిని జూచి) నరపాలా! పరస్త్రీనిని గవయఁగోరి నీవు సర్వమును నాశనము జేసికొంటివి. ఇకనిన్ను మేము శిక్షించినను లాభము లేదు. పోయి బుద్ధి గలిగియుండుము. చోరుఁడా! నీవును నిట్టి వృత్తిని మాని సుఖంపుము. రాసూనులారా! మీరు బాలురు; కావున, క్షమించితిని పొండు.

(దొంగ—రాకుమారులు—ధనపాలుడు—దుష్టబుద్ధి నిష్క్రమింతురు.)

(మంత్రి—సుమతీదేవితో ప్రవేశము.)

సుమ—(తనలో) అక్కటా! ఇది యెట్టిదింత!

కాంతా—(సుమతింజూచి) చెల్లెలా! నీవాశ్చర్యమందవలదు. ప్రియకాంతావియోగమున గుందుచుంటినని నీకుఁ దొలుత

చెప్పియున్నాను. ఈతఁడే ప్రియకాంతుఁడు; ఈతఁడే మన యిరుపురను, ఈరాజ్యమును నాతని రాజ్యమును బాలింపఁగలఁడు. ఈతఁడు నిన్ను గ్రహించుఁగాక!

సుమ—నీయధీనమున నున్న నన్ను నీవెట్లు జేసినసరే.

కాంతా—(సుమతిచేయిని—చిత్రసేనుని హస్తమునఁ బెట్టి) మనోహరా! ఈమెను మీకు నావలెనే యర్ధాంగినిఁ జేయుచున్నాను.

మంత్రి—చిత్రసేననృపాలా! మారాజకన్యయు, రాజ్యలక్ష్మియు నేఁడు కృతార్థలైరి. (కాంతామతిని జూచి) సాధ్వీమణీ! నీకారణంబున మారాజ్యము సేఁబుచుటయే గాక, మారాజపుత్రికకుఁ దగిన నాథుఁడు లభించినాఁడు.

(చిత్రసేనునిజూచి)

తే. గీ. పార్వతీగంగలకుపతియై భక్తతతిని
కరుణతో సంతతంబును గాంచునట్టి
చంద్రచూడుని విధమున జనులుమెచ్చ
ధరణిబాలింపు మాచంద్రతారకముగ.

అందఱి కోరికలును తీరినవి. ఇఁక కావలసినదేమున్నది.

కాంతా—

తే. గీ. ధరణిసస్యసమృద్ధియై తనరుగాక,
యువిదలెల్లరు సాధ్వులై యుందురుగాక!
పరసతినిగూడఁగాఁ గోరు పాపమతులు
క్షితిని దుర్యశంబంది చచ్చెదరుగాక.

తెరవాలును.

షష్ఠాంకము.

సర్వము సంపూర్ణము.



## —: అనుబంధము :—

(1) చిత్రసేనుఁడు.

గురువర వారలుకులవినుడీ ॥
స్థిరమతి దెలిపెద - నిక ॥ గురు॥
ధర - భువనమోహిని గుణముల
నరయక మీరీ - కరణినిబల్కి
తిరసి తలఁచెద॥ గురు ॥
గణికాంగనగాదానిని - మనమున దలపగవలదయ్యా
గుణముల ప్రోవని - నిర్భయముగ దెలిపెద॥ గురు॥

(2) గోవిందశర్మ

చాలుచాలు - ఇక - చాలింపుము నీమాటలు॥ చా॥
వేలవై - యీలీల - యూలేమ - సాధ్వియుంచు
బలికెదేల - వినుము లోభియందు - ధర్మగుణము
వారకులమునందు - సాధ్వియున్ - గలుగునే॥ చా॥

3 అనుబంధము.

వినుమూధనముండి - నిను గనగా హితబంధు
జనంబులు చనుదెంచెదరిది నిజమూ॥ వి॥
ధనముడిగిన నిను - గనకుంటుటయే గాకను
మనమున రోతను జూపుచు - దూరముగా
జనెదరు - కనుమా॥ వి॥

(4) అనుబంధము.

మునినైనను - జనపతినైనను. మోహింపఁగ జేసి
ఘనశీలము - మన్ననగల్పగ - మా వేశ్యలె తగుదురిలఁ॥ ము॥
కపటప్రేమను జూపించి - విటులను రావించి
సర్వముగైకొని - సన్యాసిగ గావించి - బంపించుటకీ
వారనారులనుబోలు నారిమణులీ లోకంబున లేరుకదా॥ ము॥

(5) అనుబంధము.

వనితామణియిక లెమ్మా! అనుమానమేల
యిటువినుమా - కనుమా॥ వ॥
అనయము నిన్నతిప్రేమను జూచెదు
ప్రియుఁడనుగాదా॥ వ॥
మాటికిమాటికి నీకతికోపంబూనిన
పాటలగంధిరో నేనెటుతాళుదునే॥ వ॥

(6) అనుబంధము.

చాలు - చాలు - యికేటికి - ఈమాటలు - సరగునబొమ్మా!
బేలనై - యాలీల - నిను జేర - మోసమొందితి ॥ చా॥
కపటాంతఃకరణుఁడవని - యెఱుఁగక - నీమాయకులోనై
విపుల సౌఖ్యంబులకు - దూరంబైతిని॥ చా॥

(7) అనుబంధము.

నీయానతి లేనిదె నేనేకార్యంబైనను సేయుదునా,
నాకది - తగునా - గనవానీవిది - మగువా॥ నీ॥
ప్రియంచమందున - నినుమించిన దేదియు లేదుకదా,
సుధా—నీహితము గోరుదునుగదా॥ నీ॥

(8) అనుబంధము.

ఓరా! ఈనారిమణి సోయగ మెన్నగ - నజునికితరమే॥
ధారుణి నీతన్వికి నీడకు - తన్విని గన నైతినిగా॥ ఓ॥
మోమందము - పూర్ణచంద్రునివహసియించు
కన్నులచందము - కలువల మఱపించు
దేహసౌష్ఠవముల హేమంబునుమించు
నృపాలుండీమెను గాంచిన మోహము పెంచు॥ ఓ॥

(9) అనుబంధము.

అకటా - ఈగతి కేమని వగతును॥ అ॥
అకలంకాత్ముఁడు - అపరిమాత్ముఁడు
ననుగృపఁ గనకీవిధి - యిడుమల పాల్జేసెను॥ అ॥
పూర్వభవంబున - నీదంపతుల - నెడ
బాపితి - తత్ఫలమిపుడు - పొందుచుంటిని॥ అ॥

(10) అనుబంధము

వనితామణి - యిటువచియింపగదగునే॥
నామనవిా వెఱుగక యుంటివే॥ వ॥
సర్వము నీయధీనము - సల్పితికదా
యుర్విని నీకన్నను నాకును వేరేది లేదుకదా॥ వ॥

(11) అనుబంధము.

ధాత - వ్రాత - కేమని వగతును
భూతలపతిసుతనై - యీగతి నొందితిగా॥ ధా॥
దిక్కు లేక యీకాననభూమిని
నక్కటకటా - చరియింపగ నయ్యోగా॥ ధా॥
సా॥—హే! సర్వజగన్మయా మహానుభావా
సకలామరమునీంద్ర సన్నుత చరణయుగళా

దీననైన నన్నుగాసి జేయ - నీకుధర్మమగునె
దేవాదిదేవ - దేవా॥ హానాధా॥

(12) అనుబంధము.

అజునకుందరమా - యీనారీమణి పోయగమెన్నగ॥
త్రిజగముల యందున - నీచెలి రేడగు చేడియగంటినే॥ అ॥
మోముతీరు - జలజవైరి - గేరు
కనులస్థారు - కలువలమీరు
నాతినూగారు - నల్ల చీమలబారు
దీనితీరు - పదియార్వన్నె బంగారు॥ అ॥

(13) అనుబంధము

(కాంతామతి—గుప్తబుద్ధి—డైలాగ్)

కోరికదీర్చకుండుటతగునే - చేరి - బిరాన - యీతీరున-గారి॥
ఘోరతగునా - నన్నుగనవా - కౌగిలిడవా - మనవిగానవా
అందమా - నగ - గుందజేయ - తాళజాల - సుందరీ ॥కో॥

కాంతా—పో - పో - పో - కూ్రరా - నుదయిక తెలిసెగా - అఘ
మునుగాంచగదగునా ॥(ఛీ) పో॥
పరదారలనీగతిగోరిన - దురితముకాదా - తెలియుట లేదా -
యిదివాదా - (ఛీ) ॥పో॥

దుష్ట—దురితంబైననుగానీ - మరుతూపులకాగగలేనే కాంతా-
కాంతా—ఇంతటి మూఢుండవు - నీకేమని తెలిపెద-(ఛీ) పో॥
దుష్ట—సరసము జూపవదేలా - సరగున బాలా—
సరసకు—రా—రా—రా
కాంతా—ఆయువుమూడెను - నీకని - యరయుము—(ఛీ) పో॥

(14) అనుబంధము.

వెలవెలదుల బ్రతుకతిగోతగదా - మఱిరోతగదా - కను
గోతగదా॥

యిలగలవిటులను వంచించీ - వలసినద్రవ్యము - హరియించీ-
తుదకది దొంగలపాల్గావించీ - దనరెదు॥ వె॥

(15) అనుబంధము.

హాపరమేశ్వర - దీనశరణ్యా - నా।
పాపీవనినమ్మితి - ననుగృపగనుమా॥ హా॥
దుష్టచరితునకు - ఈగతిజిక్కి-
కష్టములపాలయి - విలపించుచునుంటి॥ హా॥
నాపతి - జూచెడుభాగ్యము
నాకొదవగఁజేసి - దుఃఖముబాపుమా॥ హా॥

(16) అనుబంధము.

ఈదినమే కనుసుదినముగా॥ నాధా॥ యీ॥
నాదుపూర్వకృత పుణ్యంబెట్టిదొ నీ
పాదకమల దర్శనభాగ్యముకల్గెను॥ ఈ॥

(17) అనుబంధము.

కాకినాడానూ కాలమ్మా - నీకు - గండదీపంబెడుదూ
ఈయాలానాకు - మంచి - సామ్మొదొరికితెను॥ కా॥
నల్లపల్లీ - సంపటాలమ్మా - నీకు - మంచి
కల్లుతెచ్చీ - వారబోతూ - దయసూపుమా॥ కా॥
దొంగతవానికెల్తుండా - భంగవేవీరాకుండ
గంగానమ్మానాకు - తోడురాయమ్మా॥ కా॥

(18) అనుబంధము.

తేలొడిసింది - అయ్యొయ్యో - తేలొడిసింది

తెలుగాదురో - బాబది - నల్ల తేలురా - (బాబో) తే॥
పొద్దున్నె లేచి యెవరి - పాడు మొకము - సూచినాను
దద్దరిల్ల దేహామంత - దిక్కుమాలిననల్ల తేలుబొడిసెరా॥ తే॥

(19) అనుబంధము.

అయ్యో - ఇదేమికార్యమూ ఈపగిదిఁ జేయు॥ న॥
కుయ్యాలింపవు నీ - కృపజూపవు . ఇయ్యెడజిక్కితి దేవా॥ అ
ఈనురాత్ముడిటు నన్నకటా - దేవా॥ ఈ॥ వంచన
బుద్ధినినీగతి దోడ్కొనివచ్చెను - ఎటులసైతు॥ అ॥

(20) అనుబంధము.

సక్కనిసుక్కయిద్దినాకు - సక్కగానుసిక్కెరా
దక్కెనాకు దీనిసెక్కిలెల్ల - నొక్కి చేతు॥ వహ్వా॥ స॥
బంధుగులెల్లవచ్చి - వారెవారెయంచు మెచ్చగా
ముదముననపొంగుగూడి - సుఖముబొందుదింక॥ ఆహా॥ స॥

(21) అనుబంధము.

పోతవదేమె । పిల్లా నన్నిడి । తగునెకూకుందు-
పెళ్ళియాడ్తానిన్నూ॥ పో॥
సింగాపిసీరకట్టి - బంగారురైకపెట్టి బండమీాద
కూగోసెపెట్టి - అందఅూఖంగారు సెందగాయేలుకొంటా ।
గుంటా॥ పో॥
ప్యాడేశయనిపిల్చినా - తోడనిట్లొచ్చి
యిప్పుడేడ కళ్ళిపోచూస్తావు॥ పో॥

(22) అనుబంధము.

తక్కువేమిపిల్లానీకు - నన్ను పెండ్లాడితే॥ త॥
ఎక్కడైనకన్న వేసి తెచ్చినసొమ్ములెల్లనీకె

నిక్కపుగా యిచ్చినీకు మొక్కుతాను॥ త॥
అందసందపులలోనా - యంతవాడు లేదు
మాదయాన నీపొందుగూడనివ్వు - అందంగ నాదని॥ త॥

(23) అనుబంధము.

ఎఱుపుయాబారిసి - అంటారు - నలుపూనాడమంటారు-
నామాటయిన నేపిల్లా॥ ఎ॥
గొల్లోళ్ల మొగుడైన - గోపాలకుట్టమూర్తి - నల్లోడుగాడే
పిల్లా॥ ఎ॥

(24) అనుబంధము.

పిల్లంటె పిల్లకాదురా॥ అది॥ మావా॥ పిల్లది॥ పుల్లిగా॥ పి॥
ఆపిల్లబోలుపిల్ల మూడులోకాలలేదురా॥ పి॥
మాటయింటేను మమతపుట్టురా
దాని నీటు - గోటు - సూస్తేను తార్మారుతాతారురా॥ పి॥
రంగైనబంగారు తెచ్చి - సింగారవతిమీద
దిగదుడిచి వేయాలిరా॥ పి॥

(25) (26) అనుబంధము.

(డైలాగ్)

కాంతా—భూపాలకనందనా। నీసాహసముజాలింపుమా॥ భూ॥
ననుగోరబోకు - గదియరాకు - యిటులమాటలాడదగదు
నీకు॥ భూ॥

మొ—రా—వనితరొమదిగృపగనుము - మరుని వెతనువూన్పుమా
కాంతా—పరసతులసిటులకుగుట - పాపమనితలంపుమా
రెండ—పరసతివాగిరసతివొయిా। వనమునందుమాకు తరుణిజిక్కె-
,, నావు-

కాంతా—అయిన నిటులగోర ధర్మంబగునే
మొ—పలుపలుకు లేలనాడ - ననుగరుణగనుచు గైకొనందగున్
కాంతా—పాపమన్న తలపుపుడిగి - భామసాధ్వి నిటులనడిగెదరె॥

రాజుల్ - ధీరుల్ - అహా

రండ—నారి
కాంతా—ఏమీ.
మొ—పరుసములిటు పలుకకదగునా - మనమునగృప
గనకుండుట యగునా॥

కాం—ఆహాహాచాల్చాలికన్.
రం—కృపగనవా.
కాం—తెరవున జనకా.
మొ—భూపాలసుతున్ - ధీరోత్తమునన్ - గొనియుదముగనవో
సుఖములగనందలపవోమది - యఘమైనను నినువిడువను బాలా
కాంతా—కూ్రరత్వమువలదూ । కూళతనంబదితగదు
వీరులు - ధీరులు నవ్వరెనిన్.
రండ—నారీ - వయ్యారీ—
కాం—ఛీ—

(27) (28) అనుబంధము.

కాంతా—ప్రియ కాంతనునీడి - యటవులదిరిమ్మరుచుంటిన్.
నయమా - నన్నిటు - గోరగ - తరుణీ॥ ప్రి॥
సుమ—సుగుణా - భరణా - నామది - నీపై
ఘనముగజిక్కెను - గైకొనిబ్రోవగదగదే॥
కాం—రమణివియోగంబున - రమణీ కుందెదునాకున్
ఘనమగు రాజ్యమదేటికి - కాంతలు నేటికి॥ కానలె॥
సుమ—మిమ్ముల్గోరితి నామనసారగ - నిందుకు

# పాంచాలీమాన సంరక్షణము

అను

# ద్రౌపదీవస్త్రాపహరణము.

వెల రు 1—4—0 మాత్రమే

[గ్రంథకర్త: కేతవరపు రామకృష్ణశాస్త్రిగారు]

ఇందు ధర్మజుని రాజసూయాధ్వరము మొదలు పాంచాలీ మానసంరక్షణము వరకు గల కథ కడురసవంతముగా వ్రాయబడి యున్నది. ద్రౌపదియొక్క పాతివ్రత్యప్రభావము వాగతీతము. ధర్మజుని శాంతి వర్ణనాతీతము. దుర్యోధనుని చిత్తవిభ్రమము చిత్తవిభ్రమమునే కలుగజేయును. విదురనీతి, వికర్ణప్రబోధనములు కర్ణరసాయనములు; శిశుపాలుని యంత్యోపన్యాసము విన వేడుకగానుండును. కౌరవసభలో సుదర్శనచక్రప్రాదుర్భావము పరమాశ్చర్యకరము. యీనాటకమును యీవిధముగా యిదివరకెవ్వరును చూచిగాని, చదివిగాని, యెరుంగరు. యీనాటకము కొన్ని నాటకసంఘముల ప్రోత్సాహముచే వ్రాయబడినది. కొలఁది రోజులలోనే ప్రదర్శింపబడును. ప్రేక్షకుల కనుకూలముగ నుండునట్లును చదువరుల కానందమును, కలుగచేయునట్లును. రచియింపబడియున్నది. కొలది ప్రతులు మాత్రమే గలవు. త్వరపడనిచో ప్రతులు దొరకనేరవు. నేడే కార్డు వ్రాయుడు.

# వేశ్యామధురము

[మూడవభాగము]

ఇంతకుమున్ను రెండుభాగములు చూచియేయుందురు. ఇది మూడవభాగము. ఇది కడురసవంతముగా వేశ్యలయొక్క మర్మములు విటులయొక్క దురవస్థ విపులముగా వ్రాయబడియున్నది. ఇందు బ్రాహ్మణవితంతువుయొక్క బహిరంగవేదాంతము. చివరకు వేశ్యలలోకలిసి వేశ్యావృత్తిచే పోషింపబడుచూ నొకనేరరుడు మోసముచేసి గొలుక సాహెబ్ కు నంటగట్టుట చాలా ఆశ్చర్యముగా యుండను చదివినిశ్చలంది విన వేడుకగా యుండును.

# సంగీత కృష్ణలీల

**వెల రు 1—0—0 మాత్రము.**

[గ్రంథకర్త: సంపన్మంబ రంగరాచార్యులుగారు]

ఇందు శ్రీకృష్ణుని లీలలు పరమాద్భుతములు. ఇందు కంసుని యొక్క దుండగములు, గోపకులయొక్క భక్తియు, పూతనాసంహారము, గోవర్ధనోద్ధరణము, కాళీయమర్దనము, గొల్లవాండ్లయొక్క హాస్యరస సంభాషణము, రాధాకృష్ణుల శృంగార సంభాషణము రహస్యముగా వ్రాయబడియున్నది. ఇందు చక్కని పాటలు కేతవరపు రామకృష్ణ శాస్త్రిగారిచే రచియింపబడి యున్నవి. కొలది ప్రతులు మాత్రమే ముద్రించినారము. త్వరపడనిచో ప్రతులు దొరకవు.

# పాదుకాపట్టాభిషేకము

వెల రు 0—12—0 మాత్రమే.

[గ్రంథకర్త: గోగినేని రాజు సీతారామరావుగారు]

ఇందు మంథర దుర్బోధచే కైక దశరథుని వరములడిగి రామలక్ష్మణుల నరణ్యమునకు పంపుట మొదలుకొని పాదుకాపట్టాభిషేకమువరకు విపులముగా వ్రాయబడి యున్నది. ఈకథ సర్వజన విదితమేగాన వివరించి వ్రాయలేదు. ఇందు చక్కని పాటలుగలవు. రెండువేలప్రతులు అనుకొన్నంతకాలములో ఖర్చుపడుటచే మూడవకూర్పు ముద్రించియుంచినారము. కొద్దిప్రతులు మాత్రమే గలవు.

# శ్రీ విజయభాస్కర నాటకము

[గ్రంథకర్త:—జమ్ములమడక లక్ష్మీనృసింహాంగారు.]

భట్టవిక్రమార్కుని మనుమడు చరిత్రయంతయు నాటకముగా వ్రాయబడినది. విజయభాస్కరుని యొక్క సాహసధైర్య ఔదార్యములు నెఱుగదలంచినచో ఈనాటకమే తప్పక చదివితీరవలయును. ఇందచ్చటచ్చట పార్సీనాటకపద్ధతులు గూడాగలవు. వెల రు 1—0—0

వలయువారు:—కురుమూరి సుబ్బారావు,

బుక్కుసెల్లరు, భీమవోలు, కృష్ణాజిల్లా.

